
గృహలక్ష్మి
స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములను
పెంపొందించుట కేర్పడిన
సచిత్ర మాసపత్రిక
ప్రొప్రైటర్లు : కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.
అక్టింగ్ ఎడిటర్
సి. సి. పున్నయ్య
సంపుటము ౨౭ ]
జనవరి 1958
[సంచిక ౧

# వి ష య సూ చి క

O——X——O




జయజయ గృహలక్ష్మీ సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!

జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



# బాలికల విద్యావ్యాప్తి



హైదరాబాద్‌లో జరిగినఅఖిల భారత మహిళాసభ సమావేశంలో స్త్రీవిద్యా వ్యాప్తి ఎన్నతగినంత తృప్తికరంగా లేదని అధ్యక్షురాలు చెప్పినవిషయం గమనించ తగినది.

విద్యా విజ్ఞానముల వ్యాప్తి జాతీయశ్రేయస్సును పట్టుకొమ్మ. కాని, విజ్ఞాన తృష్ణతో స్త్రీలుగాని, పురుషులుగాని విద్యనభ్యసించుటకవకాశములు మనదేశంలో యీ నాడు హెచ్చుగాలేవు. జీవితావసరములైన కూడు, గుడ్డలను చాలినంతవరకు అమర్చలేని ఆదాయంతో అలమటిస్తున్న ప్రజానీకము తమ ఆదాయంలో కొంత

భాగమును తమ బిడ్డల విద్యావసతులకు వినియోగించగల అవకాశములు కలవని యన సాహసించలేము. ఒకవేళ కష్టనష్టములతో విద్య చెప్పించినను అది ఏ ఉద్యోగ సంపాదనను ద్దేశించినదో కాని విజ్ఞానార్జనను ద్దేశించినది కాదు. ఇక బాలికల విద్యాసందర్భమున ఏనాటికైనా వివాహమయి మరొకయింటికి పోవలసినవారు కాబట్టి పిల్లలకు శ్రమపడి చదువు చెప్పించినా తమకుకాని, తమ కుటుంబమునకుగాని వారి సంపాదన తోడ్పడునదికాదని కొందరు భావించుట సహజము.

అవకాశములున్నవారైనను తమ ఆడబిడ్డలకు మంచి వివాహసంబంధముల నుద్దేశించియో లేక ఉద్యోగ సద్యోగముల నుద్దేశించియో కాని విజ్ఞానాన్ని ఉద్దేశించి విద్య చెప్పించువారి సంఖ్య తక్కువ.

విజ్ఞాన వికాసములను పెంపుచేయువిద్య ప్రతియొక్కరికి అవసరము. విద్యనభ్యసించుటకు తమకు చాలిచాలని ఆదాయంకాని, దారిద్ర్యముకాని అవరోధములు కారాదు. తమ ఉత్సాహ ఆసక్తులకొద్దీ విద్యనభ్యసించి, తామార్జించినవిజ్ఞాన అనుభవములు, శక్తిసామర్థ్యములు వివిధరంగాలలో జాతీయశ్రేయోపురోభి వృద్ధులకు వినియోగపర్చకలుగాలి.

ఈ సందర్భమున బాలబాలికలకు ఒక్కగుమాస్తాగిరి యుద్యోగానికే కాక వారి అభిలాషననుసరించి వేర్వేరు రంగాలలో తామార్జించనున్న విద్య వినియోగపడకలుగునట్లుగా విద్యావిధానము రూపొందవలసిన ఆవశ్యకత ఎంతైనాకలదు. ప్రతియొక్కరికి విద్యావసతులు అందుబాటులోకివచ్చిననాడు సమాజవికాసము, అభ్యుదయపురోభివృద్ధులు మరింత మెరుగుకాగలవు. ప్రభుత్వ అభ్యుదయ ప్రణాళికలలో విద్యావ్యాప్తి ప్రాముఖ్యము వహించవలసియున్నది.

సంపన్నులగు దాతలు విద్యావసతుల వ్యాప్తికి ప్రభుత్వము తలపెట్టిన కార్యక్రమాలతో సహకరించి సహాయపడగలరని ఆశిద్దాం!

# గ్రామము - ఆరోగ్యము

శ్రీ గాడేపల్లి శంకరం

శరీరము ఆరోగ్యముగా నుంచవలెనంటే - ప్రతి దినము స్నానము-పరిశుభ్రమైనబట్టలు - మంచిగాలి - వెల్తురు - నీరు - పరిశ్రమ - పుష్టికరమైన వేళకుఆహారము - అవసరమని అందరికీ తెలుసు - శరీర ఆరోగ్యము ఎంత ముఖ్యమో గ్రామపరిశుభ్రతకూడా అంత అవసరం. రెంటికీ అవినాభావసంబంధమున్నది. మనం పీల్చేగాలి - త్రాగే నీరు - తినే ఆహారపదార్థములు-ధరించే బట్టలు - ఇవన్నీ పరిశుభ్రంగావున్నా - మనం నివసించే పరిసరాలు అపరిశుభ్రంగావుంటే అవి పాడుకావటానికీ అనారోగ్యకరముగా తయారుకావటానికీ అవకాశంవుంది-మన ఇంటినీ వంటినీ మాత్రమే పరిశుభ్రంచేసుకు కూర్చున్నా ప్రయోజనంవుండదు - గాలి - నీరు ఆహారపదార్థాలు మనకు బయటినుంచి రావాలి - బయట పరిశుభ్రతలేనప్పుడు - ఇవి పాడై మన ఇంటబడి - మనలనుకూడా పాడుచేస్తున్నాయి. అందుచేత గ్రామపారిశుధ్యం అత్యంతావశ్యకమైందని గుర్తించాలి. గ్రామం పరిశుభ్రపరచినంత మాత్రం చేత పునర్నిర్మాణం పూర్తిగాదు. మన పల్లెవాసుల ప్రతి ఒక్కరిలోనూ పరివర్తనరావాలి - వారిలో పరివర్తన వచ్చేవరకు పనులుచేయకుండా కూర్చోటానికీ వీలులేదు - బహుళ ప్రచారంవల్ల వ్యక్తుల దృక్పధంలో మార్పు తీసుకురావటానికి ఒక వంక ప్రయత్నం చేస్తూ-గ్రామంలో ఎక్కడా తుక్కుదూగర లేకుండ-పెంటవగైరాలను ప్రతి రోజూ తుడిచి పారేస్తూండాలి ఇట్లా పరిశుభ్రం చేస్తున్నకొద్దీ - గ్రామస్థుల ఆరోగ్యం బాగుండటమేకాకుండా - అది వారికి అలవాటు అవుతుంది - ఆ తుడిచిపెట్టిన-పెంటయావత్తూ పొలాలకి ఎరువుగా ఉపయోగిస్తుంది. వాడిన మురికి నీరు పాదులకు - పూలమొక్కలకు పనికివస్తుంది ఏ ఇంటికి ఆ ఇల్లే ఈ పెంటను - మురికినీటిని మరగబెట్టి అనారోగ్యకరంగా వుంచడంకన్న - ఏ ఇంటి యజమాని ఆ ఇంటిలోనే దీని వాడకమునకుగాని - దూరముగ తొలగించుటకుగాని ప్రయత్నంచేయాలి - అంతేగాని వీధిలోకి నెట్టివేస్తే లాభంలేదు - వీధుల తుడిచే పాకీవాళ్లుగల పంచాయితీలలోకూడ-పెంటను - మురికినీటిని బయటకు నెట్టేటప్పుడు - వీధిని పాడుచేయకుండ - ఒక నిర్ణీత ప్రదేశంలో - అనగా మురికి నీటిని కుండీలోనికీ - పెంటను తుక్కుడబ్బాలోనికీ చేరిస్తే - వీధులు తుడిచేవాళ్లువచ్చి పట్టుకుపోతారు- లేదా దొడ్డుగల ఆసాములు-తమ ఇంటచేరే పెంటను- ఒక గోతిలోనికి - మురికినీటిని పాదులలోనికిచేర్చి - పరిశుభ్రతను కాపాడుకోవచ్చును - పంటకు ఉపయోగించుకొనవచ్చును - ఇటువంటి విషయాలలో శ్రద్ధ ఎక్కువగా వుండాలి - బద్ధకించకూడదు - వాడకపు నీరు వర్షపునీరుకూడా ఎక్కడా మురిగిపోకుండా చూసుకోవాలి - దోమలుండవు - దోమకాటువల్ల సంభవించే రోగాలురావు - రోడ్లు మట్టివైనా - ఈ ఏర్పాట్లుచేసుకోవచ్చు. పదిమంది నడిచేరోడ్లు ఎట్లావున్నా బళ్లుపోయేరోడ్లు మాత్రం కంకరతో నిర్మించుకోక తప్పదు. రోడ్డు ప్రక్కన కాలువలు - కాలువలద్వారా నీటి ప్రవాహమునకు 'వాలు' వుండి తీరాలి. నీరు మురిగితే - ఒక్క దోమలేకాదు - దుర్వాసన - వేస్తుంది. ఈగలు ముసురుతాయి - ఈగలవల్ల వ్యాధులు ఒకరినుండి ఒకరికి ప్రాకుతాయి- కనుక వీటినుండి తప్పించుకోటానికే - ఎక్కడా పెంటలేకుండాను - నీరు మురిగిపోకుండాను చూసు

కోవాలి. ఈ చూడటం - ఇంటాబయటాకూడా అవసరం.

నాగరికత నగరవాసులకే చెందియుండలేదు అసలు నాగరికతకు నాల్గులక్షణాలున్నాయి. ఏ ప్రజలయందు ఈ నాలుగు లక్షణాలు కనబడుతాయో - వారు నాగరికులనడానికి సందేహించ నక్కర్లేదు - ఒకటి ఆత్మగౌరవము, రెండు ఆత్మనిగ్రహము, మూడవది క్రమపద్ధతి - నాల్గవది సహకార భావము. ఇవి నాగరికుల లక్షణాలు - ఇవిగల తల్లిదండ్రులు తమ పిల్లలకు నేర్పుతారు - తరువాత పిల్లలు బడులలోనికిపోయి - పంతులవారివద్ద పఠనముచేసి - అభివృద్ధిచేసుకొని - భావిపౌరులుగా తయారవుతారు. మన అలవాట్లే మన పిల్లల్లో ప్రతిబింబిస్తూ వుంటాయి. గ్రామంలో ఏ క్రొత్త విషయము మనము ప్రవేశపెట్టవలసివచ్చినా, పిల్లను ఒడిలో నుంచుకొన్న తల్లికి - బాలబాలికలను ఎదుట కూర్చుండబెట్టుకొని పాఠము చెప్పుతున్నా బడిపంతులుకి ప్రథమంలో నచ్చచెప్పాలి. అన్నంపెట్టి గుడ్డలుతొడిగి బడికి పంపించినంత మాత్రంతో తల్లి పనితీరిపోలేదు - అట్టలమీద నీతివాక్యాలువ్రాసి గోడలమీద వ్రేలాడకట్టడంతో ఉపాధ్యాయుని పని సమాప్తంకాలేదు - పిల్లవాని విషయంలో తల్లీ - ఉపాధ్యాయుడుకూడా చాలా బాధ్యత వహించవలసి వుంటుంది - వీరియిద్దరే భావిపౌరులనదగు బాలబాలికల భవిష్యత్తు ఆధారపడివుంది. వారు చెడినా బాగుపడినా వీరే బాధ్యులనడానికికూడా సందేహంలేదు - శుచిశుభ్రతలు అలవాటుచేయడంలోగాని - క్రమపద్ధతులు నేర్పాటులోగాని - ఆత్మనిగ్రహము, ఆత్మగౌరవము - సహకారభావము కలుగచేయడంలోగాని - తల్లీ - తరువాత ఉపాధ్యాయుడూకూడా పిల్లల విషయంలో అత్యంత శ్రద్ధ తీసుకోవలసివుంది.

శుచియైన శరీరము - శుభ్రమైనబట్టలు - సుందరమైన వాతావరణములో - నాగరికతా లక్షణములు కలిగి జీవించటమే స్వర్గము - తద్వ్యతిరేకమైన జీవిత విధానమే నరకము. శరీరము, పరిసరములు ఎంత ఆరోగ్యంగా వుంటాయో, మన మనస్సుకూడా అంత వికసించటానికి అవకాశం వుంటుంది. అందుచేతనే నాగరికతకు ప్రథమసోపానమైన పరిశుభ్రతను ప్రతి గ్రామమునందును కాపాడాలి-

రోడ్లు తిన్నగా నిర్మించుకోవాలి - రోడ్డు కిరుప్రక్కలా కాలువలుండాలి. మురికి నీరుగాని - వర్షపునీరుగాని - ఒకచోట నిలిచిపోకుండా - ప్రవహించి - నిర్ణీతస్థలాన్ని చేరునట్లు 'వాలు' చూసుకోవాలి. కాలినడకకు మాత్రమే ఉపయోగించే చిన్నరోడ్లు-బురదలేని - ఏ ఇతర సామగ్రితోనైనా నిర్మించుకోవచ్చుకాని బళ్లరద్దీకి ఉపయోగించే రోడ్లు మాత్రము కంకరతోనే వేయవలసి వుంటుంది.

ప్రతి ఇంటిముందు తుక్కుడబ్బా - మురికినీటికుండీ ఏర్పాటుచేసి అవి గ్రామానికి దూరంగా ప్రతిదినము తీసుకుపోయే ఏర్పాట్లు చేసుకోవాలి - అట్టి అవకాశము, అవసరములేని చిన్న ఇండ్లవారు, తుక్కును పారవేసే గోతులు దొడ్లలోనే, నిర్మించుకోవచ్చును. మురుగు నీటిని, పాదులకు ఉపయోగించవచ్చును.

గాలీ, నీరూ, వెల్తురు భగవంతుడిచ్చినవి;దీనికికూడా లోపం చేసుకోవడం తెలివితక్కువకాదా?

త్రాగటానికి మంచినీటి చెరువునో - భావినో - ఏర్పాటు చేసుకోవాలి. ఎడ్లను - పశువులను కడగటానికీ, బట్టలు ఉతుకడానికీ - మరియొక చెరువునో నూతినో ఏర్పాటు చేసుకోవాలి. మంచినీటి చెరువులలో, పశువులను కడుగకూడదు. బట్టలు ఉతుకకూడదు - పారుదలగల కాలువైతే తప్ప - స్నానముకూడ చేయగూడదు. చెరువుగట్టు పాడుచేయకూడదు.

ప్రతిఇంటా కక్కోసులను ఏర్పాటుచేసుకోవాలి - ప్రతి రోజూ తుడిపించుకోవాలి. కక్కోసులో మోకాటిలోతు ఇసుకతోలించాలి — ఈ కక్కోసులు బావి దగ్గరగా వుండకూడదు పడకటింటి ప్రక్కనూ వుండకూడదు - కన్నపు కక్కోసులు (Bore - hole latrines) ఇప్పుడు

చాలాచోట్ల ఉపయోగిస్తున్నారు. ప్రతి ఇంటా పాయిఖానా ఏర్పాటు చేసుకునే అవకాశం లేనప్పుడు — ఊరికి దూరంగా చేలగట్లవరకు పోవటమో, పబ్లిక్ కక్కోసును ఏర్పాటు చేయుటమో మంచిది- పురుషులు దూరంగాపోగలరు- స్త్రీలు మాత్రము పోలేరు - వారికైనా పబ్లిక్ కక్కోసు అవసరం - ఊరికి కొలది దూరంలో - ఏర్పాటు చేయవచ్చు - 'గాలి' దానిమీదుగా ఊరి మీదికి వాలుగల ప్రదేశంలో నిర్మించకూడదు. చెరువుగట్లమీదను, బావుల సమీపంలోనూకూడా వీటి నిర్మాణము ప్రమాదమే. సూర్యరశ్మిచొరబడే బహిర్దేశము మిక్కిలి అనుకూలంగా వుంటుంది - ఏ గ్రామాని కాగ్రామం వారి అనుకూలమునుబట్టి నిర్మించుకోవాలి. అనారోగ్యకరముగా మాత్రము పరిణమించకూడదు. పంచాయితీవారు ప్రతి నిత్యము దీనిని తుడిపించి పరిశుభ్రముగా వుంచే ఏర్పాటు చేయాలి. పాకీపనివారు దొరకని చిన్న గ్రామములలో కన్నుపుపాయిఖానాలు వాడటమే శ్రేష్ఠము - సుకరము - ప్రయోజనకరము.

అది ఎంత చిన్నగ్రామమైనా - ఆ గ్రామంలో ఒక దేవాలయం - రామమందిరం - అక్కడనే ఒక పఠనమందిరము, గ్రంధాలయము - ఆప్రక్కనేఆరామము - అందులోనే ప్రాథమిక పాఠశాల - పంచాయితీబోర్డు ఆఫీసు - ప్రక్కనే, శిశుసంరక్షణ కేంద్రము వుండటం చాలా అవసరం.

పిల్లలు ఆడుకోటానికి ఆటస్థలం - తల్లులకు రక్షణ యిచ్చే మాతాశిశురక్షణాలయం తప్పకుండా ఏర్పాటు చేసుకోవాలి - ఆరామముల ఏర్పాటుకూడా ఆరోగ్యానికి దోహమిస్తాయి - గ్రామం - ఆరామములలోను - ఆటస్థలాలలోను — పూలమొక్కలతోను కలకలలాడేటట్లు చేసుకోవడం కష్టమైనపని కాదు — ఆరోగ్యానికీ ఆనందానికీ దోహదమిస్తాయి.

ఆరోగ్యానికీ ఆహారంకూడా ముఖ్యమైన విషయమే - తినే ఆహారం పుష్టికరంగాను - పరిశుభ్రము గాను - వుండాలి - పాలు, పళ్లు - కాయగూరలు తేనె, గ్రుడ్లు — మాంసము మొదలైన ఆహారపదార్థాలు పక్వమైనవిగాను పరిశుభ్రంగానుకూడా వుండాలి. ఇవి ఏగ్రామాని కాగ్రామం పండించుకొనేవే - పాలు, వెన్న - నెయ్యి - పప్పుదినుసులు, ధాన్యం మొదలైన ఆహార పదార్థాలలో కల్తీలేకుండా వుండాలి. ఈగలు దోమలు ముసరకుండా వుండాలి- మూతపెట్టి భద్రంగా కాపాడుకోవాలి.

దరిద్రానికీ ఆరోగ్యముగా వుండటానికీ ఏమీ సంబంధములేదు. ఎంత దరిద్రుడైనా భగవంతుడిచ్చిన గాలి, నీరు, వెల్తురును పరిశుభ్రముగా వుంచుకోవచ్చు. త్రాగే గంజిమెతుకులైనా ఈగలు దోమలు ముసరకుండా మూతపెట్టి భద్రంగాను - శుభ్రంగాను వుంచుకోవచ్చుగదా! వంటకు కుండలు ఉపయోగించినా - కడిగి వాడుకొనవచ్చుగదా! ధరించే బట్టలుకూడ ఉతికి ఆరవేసుకొనవచ్చు - వళ్లు తోముకొని స్నానముచేయవచ్చు - ఈ పనులకు భాగ్యమే వుండనక్కర్లేదు.

రోగములు వచ్చిన తరువాత చికిత్సకై దేవులాడుటకన్న అసలు రోగములే రాకుండ కాపాడుకొనుట మంచిదిగదా! సాధారణముగా గ్రామములలో వచ్చురోగములు - అవి సంక్రమించుటకుగల కారణములు - వాటిని నిరోధించుటకు అనుసరించవలసిన మార్గములు ప్రతి ఒక్కరు తెలుసుకొనుట మంచిది.

మానవులు నివసించే వాతావరణమునుబట్టి వ్యాధులు సంక్రమిస్తాయని శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. ఈ వాతావరణము అనారోగ్యకరముగా వున్నప్పుడు రోగభూయిష్టముగా తయారవుతుంది - ఆరోగ్యవంతముగా నున్నప్పుడు స్వర్గతుల్యంగా వుంటుంది. ప్రకృతి దేవత గ్రామాలను కాపాడుతుంది - ప్రకృతిని అలక్ష్యంచేసి కృత్రిమవాతావరణములో నివసిస్తే రోగాలే సంక్రమిస్తాయి - ఈ కృత్రిమ జీవితం పట్టణాలలోనే దారుణంగా వుంటోంది. పల్లెవాసులు కాస్త జాగ్రత్తవహిస్తే

చాలు. వారు ఆరోగ్యంగా వుండటానికి అవకాశం వుంది. పట్టణాలలో అట్లాకాదు. ఎంత జాగ్రత్తగావున్నా జనసమ్మర్దంచేత - ప్రజల తోడ్పాటు లేకపోవడంవల్ల రోగభూయిష్టాలే అవుతున్నాయి. అయితే పట్నవాసులకు దగ్గరగావున్న పల్లెగ్రామాలూ పాడవుతున్నాయి! అజాగ్రత్తవల్లా - అపరిశుభ్రతవల్లా ఆరోగ్యం పాడవుతోంది. కలరా, ప్లేగు - టైఫాయిడ్ - మలేరియా మొదలైన భయంకర వ్యాధులు పట్టణాలనుంచి పల్లెలకు ప్రాకిపోతున్నాయి. ఆసుపత్రులు డాక్టర్లు అక్కడకూడా అవసరమవుతున్నాయి. పట్టణాల విషయంలో మ్యునిసిపాలిటీలు శ్రద్ధ తీసుకుంటున్నాయిలెండి. పల్లెగ్రామాలలో - మాత్రం పంచాయితీలు, ప్రజలు శ్రద్ధతీసుకోవాలి.

---

# క్రిమిసంహారక కాగితం



ఒక కార్మికుడు పని చేస్తుండగా చేతికి చిన్న దెబ్బతగిలిందనుకోండి. "ఈ మాత్రం దానికి డాక్టరు దగ్గరికి వెళ్లడమెందుకులే" అనుకుని తనపని చేసుకుపోతాడు. అందువల్ల నెత్తురువిషమెక్కే ప్రమాదముంది. అయితే డాక్టరువద్దకు వెళ్ళి కాలం వృధా చేసుకోనవసరం లేకుండా కార్మికుడు క్రిమిసంహారక కాగితం ముక్క తీసుకొని గాయం మీద అంటిస్తే అది త్వరగా మానిపోతుంది.

కోతలు, దెబ్బలు, చిన్న చిన్నగాయాలు, కాల్పులు, తదితరమైనవాటికి యీ కాగితాన్ని ఉపయోగించవచ్చును. దీనిని సోవియట్ శాస్త్రజ్ఞుడు ఐ. కాల్చిన్ కనిపెట్టేరు. జలుబును నిరోధించడానికికూడా దీనిని వాడవచ్చును. ఈ కాగితంముక్కలను బహుచిన్న చుట్టలుగా చుట్టి ముక్కులోవుంచుకుంటే శైత్యక్రిములను నిర్మూలించడానికి తోడ్పడతాయి.

...o...

## అంధత్వం రాకుండా కొత్తమందు

అంధత్వానికి దారితీసే పిగ్ మెంటరీ రెటినిటిస్ అనే వ్యాధిని అరికట్టడం యిటీవలవరకూ అసాధ్యంగా వుండేది. ఇప్పుడుదానికి సోవియట్ దేశంలో మందుకనిపెట్టబడింది. పశువుల పిట్యూటరీ గ్రంధినుండి తయారు చేసిన ఇంటర్ మెడిన్ అనే పొడి అది. ఈ మందు వాడితే కన్ను కాంతిని చూడగలిగేటట్లు చేసి అంధత్వంరాకుండా కాపాడుతుంది. కొన్ని నెలలపాటు యీ చికిత్సజరిగితే సత్ఫలితాలు కలుగుతాయి.

---

# ముగ్గుల పండుగ

శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి

వచ్చింది విల్లు నెల
బాలికల్లారా
వచ్చింది ముగ్గుల
పండుగొచ్చింది.
అద్దంపు నునుపుతో
దిద్ది ముంగిళ్లు
కలయంపి, చల్లరే
మలికోడి కూత.
ఎడ[illegible] యబోకక్రి
క్కి ఊసి వాకిళ్ల
హెచ్చరిక పెట్టరే
హెచ్చు ముగ్గుల్లు.
తరణి తరలేను, అర
దమ్మసాగేను
సాగేను ముగ్గుల్ల
సంక్రాంతి రథము

ముత్యాల రతనాల
ముగ్గులన్ని లిపి
నేల కొంగొత్త అం
దాలు దిద్దండి
కర్రి తీసిన నేల
కళకళల నాడు
చిగురు తీర్చిన గోడ
సొగసు తూగాడు
సొగసు ముగ్గుల మీద
సొగసు తెలిసేను
కోమరు మీరిన పెండ్లి
కొడుకు వచ్చేను.
వచ్చింది విల్లు నెల
బాలికల్లారా!
వచ్చింది ముగ్గుల
పండు గొచ్చింది



# సంక్రాంతి

శ్రీ ధాయిపులె బాలకృష్ణరావు

ఈ రోజు రాత్రి కొంచెము త్వరగానే పడుకున్నాను. నిద్రాదేవి నన్నింకా ఆమె ప్రశాంత కౌగిటిలో చేర్చుకోలేదు. మా రూము మేట్లిద్దరు మాట్లాడుతూ అసందర్భంగా 'సంక్రాంతి పండుగ' అని వాళ్ళ నోటినుండి రెండు మాటలు వెలువడ్డాయ్. అంతే! తలంచుకుంటూ కొద్ది క్షణాల్లో నిద్రపోయాను, రాత్రి కలగన్నాను.

ఎంత శోభాయమానంగవుంది యీ రోజు. ఏంటి యీ రోజు మా అమ్మ ధోరణిమార్చి తలంటుస్నానం చేయమంటుంది నన్ను! ఎప్పుడూ లేని పిల్లల అలజడి మా యింట్లో క్రొత్తగావుందే. మామూలుగావుండే గోలకంటే యీ గోల కొంచెము కిలకిలలతో యిల్లంతా కళకళలాడుతుందేమిటి - అనుకుంటూ నివ్వెఱపోయి చూస్తూ నిలబడ్డాను. "ఏరా అలా చూస్తున్నావే - నీకేమైన మతిపోయిందా. ఈ రోజు సంక్రాంతి పండుగకదూ! మరిచిపోయావూ. తలంటుస్నానంచేద్దువుపదా!" అంది మా అమ్మ. పండలైపోయాను. కడలిలోని అలలు విప్పున యెగసి వచ్చి జివ్వున ముఖముపై నీళ్లు జిమ్మినట్లయ్యాయ్. తేరుకున్నాను. తెలిసికొన్నాను యీ రోజు సంక్రాంతని. ఔరా! కాలచక్ర పరిభ్రమణ మెంత త్వరితము? అటులపోయిన సంక్రాంతి అపుడే యిటుల వచ్చినదే. కొంచెము విదాన్నిస్తే దాని అబ్బగంటు ఏమిపోతుంది? ... ఓహో! దానికేమైనా మన మానవుల్లోలాగె బానిసలను కసరికొట్టే లాంటి వాళ్లున్నారేమో. అవును - వున్నాడుగా వారికీ - మనకు అధినేత, సూత్రధారుడు - దేవుడు. ఈ విషయాల్ని శాస్త్రి విద్యార్థులకు చెబితే నవ్వుతారేమో! వాళ్లు దేవుడున్నాడని నమ్మరుగా!!

తలంటుచేశాను. బట్టలువేసికొన్నాను. సాయంత్రమైంది. ఎక్కడికి పోవడానికి మనస్కరించలేదు.

"ఏరా! యింట్లో యిలాగే కూర్చుంటావా! కూపస్థమండూకంలా. పండుగరోజు అలా ఒకసారి బయటికిపోయి రాకూడదూ." మా బామ్మ లోపలినుండి కేంకారావాలు పెట్టింది. చచ్చానురా దేవుడా అనుకొని బట్టలు సత్రున మార్చుకొని తుర్రున బయటికి వెళ్ళిపోయాను.

రంగురంగుల చీర లలంకరించి సుగుణాలరాసులు, అందాలరాసులు, రకరకాల రాసులగు నారీమణులు బజారువీధిలో బయలుదేరారు. దేవాళయము వేపు పోతుండే మగువల అందాన్ని రసగ్రహపారీణులగు మగవాళ్ళు చూస్తూ ఆనందిస్తూ నిలబడ్డారు.

దినకరుడు పక్షపాతంలేకుండ లోకాన్ని పరామర్శించి పడమటి కొండల లోయల్లోకి మెల్లిమెల్లిగ విగళితుడగుచున్నాడు. రంగురంగుల చీరలసొంపు ఆ సంధ్యాసమయ కమల బాంధవ కిరణకాంతులచే తళతళమని మెరుస్తూవుండినవి. వాళ్ళ నడకల కదలికచే చీర కుచ్చెళ్ళు పవనవేగ ప్రసారితంచే నాట్యమాడసాగాయ్. వారి మడమలకావృత్తమైవున్న గొలుసుల నాదము ఆ నాట్యానికి లయగా కుదురుకొని పడతుల నడకలకొక అందాన్ని చేకూరుస్తూ వున్నయ్. పవనప్రసారితముచే బజారుధూళి కంధూళులై వారి వదనమండలమున పౌడరువలె నెలతవహిస్తుండెను. కొందరు రమణీమణులు జలతారు లేసులతో అల్లిన చేతిగుడ్డలను ముఖమునకు చేర్పిస్తుండిరి. కొందరు స్త్రీలు యీర్ష్యచే యితర వస్త్రాభరణములగు వారినిచూచి తమ ఆభరణములను సవరించుకొనుచు చరచరా సెలయేటిలా ముందుకు సాగిపోతుండిరి. కొన్ని క్షణాల్లో చెఱువుగట్టుపై జనసమూహము కిటకిటలాడుతుండినది.

మలయమారుత పవనాలు మంద, మందంగా నంద్యాల చెఱువుమీదుగవీచి గట్టుపైనున్న జనసమూహాన్నెదుర్కొని చక్కిలిగింతలు పెడుతుండెను. అందరును బ్రహ్మానందులై వుండిరి. చెఱువుగట్టుపై కూర్చొని కారాలుతింటూ ప్రకృతిమాతను తిలకిస్తున్న నా దగ్గరికి ఒక పాతస్నేహితుడొచ్చి కారాలుపెట్టమని బలవంతంచేశాడు. మతిమరుపునే కసరికొట్టాను. నా విలక్షణ స్వభావము అతనికి నచ్చలేదు. వాడికి "నేలయు నింగియుఁ దాళముల్ గాజేసి" అన్నంత కోపమువచ్చి తన ముష్టిబంధముచే ఒక్కవ్రేటు వేశాడు. నేను ఆ దెబ్బకు రెండు దొర్లులు దొర్లాను.

ఉషోదయము కావస్తుంది. కళ్లు నులుపుకుంటూ లేచి చూచేప్పటికి సిమెంటు బెంచిమీదినుంచి క్రిందికి దొర్లిపడివున్నాను. కలికాలపు కలలు యింతేనా అని అనుకున్నాను!!

# రెండు జీవితాలు

శ్రీ మాడభూషి వెంకటాచార్యులు



కళ్లజోడు సరిచేసుకొని భాను ఉత్తరం చదవ మొదలెట్టాడు.

"ప్రియమైన భానూ,

అంతా క్షేమం. నీ జాబు అందింది. అది చదువుతూ ఉన్నంతసేపూ నీ మీద పట్టరానికోపం వచ్చింది. నువ్వే నా ఎదురుగా ఉంటేనా — నీ బుగ్గలుపట్టుకొని నులిమేసి ఉందును; నిన్ను రక్కేసి పెట్టేదును. నీ అక్క హృదయం నీకు ఇంకా అర్థం కాలేదుగదా. ఎలా అవుతుందిలే? తరతరాల నుంచి స్త్రీ జాతిని అణచిపెట్టి ఉంచిన ఆ నిష్ఠుర పురుషజాతికి చెందినవాడివేగా నువ్వుగూడ!

చలంరాశాడే 'స్త్రీ'లో స్త్రీని గురించి, ఎంత నైచ్యంగా ఈ నాటికాలంలో స్త్రీ తన జీవితం గడుపుతోందని. అంతకంటె కనాకష్టంగా, నికృష్టంగా, కాలం వెళ్లబుస్తున్నా. ఆ పుస్తకం మొదటిసారి చదివినప్పుడు కలలోగూడ అనుకోలేదు నాగతీ అల్లాఅవుతుందని. కాని అల్లాగే 'అయింది. అచ్చంగా అల్లాగే!

ఒక దున్నపోతుకు నన్ను అంటగట్టి నా జీవితమంతా వాడితో ఉండి ఏడవమని శాసించింది ఈ పాడు సంఘం. దానికి హృదయం ఉంటేగా feelings ఉండడానికి. ఈ పోతురాజు నాకింత తిండి, కట్టబట్ట, ఉండటానికి పంచ ఇస్తున్నాడు. అందుకుగాను నా శరీరం, నా మనస్సు, నా ఆత్మ - ఇవన్నీ నాశనం చేసుకోవాలి."

ఇంజనుకు హఠాత్తుగా బ్రేకుపడింది. "ఈ ఉత్తరం రాసిందెవరురా? ఆ నారీమణి భోగట్టా కాస్త సెలవిద్దూ భానూ! పుణ్యం ఉంటుంది" అన్నాడు భరత్ మోహన్.

భాను క్లుప్తంగా చెప్పాడు. "ఆమె ఒక దేవి. వయస్సు పాతికపైబడ్డాయి. ఇంటరు ప్యాసయింది. చిత్రకళ నేర్చుకుంది. మంచి శ్రావ్యమైన గాత్రం. బాగా పాడుతుంది. కాస్త ఫిడేలుకూడ వాయిస్తుంది. పెళ్లిఅయి నాలుగేళ్లయింది. ఇప్పుడు కోయంబుత్తూరులో అత్తారింట్లోఉంది. స్కూల్ ఫైనలుదాకా తాను ఆమె తణుకులో ఒకే క్లాసులో చదువుతుంటూ వచ్చారు. తనంటే ఆమెకెంతో ఇష్టం. తన్ను సొంత తమ్ముడిలాగా చూసుకుంటోంది."

"ఏమిట్రా పురాణం చెపుతున్నావ్? ఆ ఉత్తరం చదువు" అన్నా వినుగుకుంటూ.

"ఇంకొక్కమాట చెప్పనీయరా ఆచారీ" అన్నాడు భాను.

"సరే. ఆమె చక్కనిచుక్క "అంతేనా?" అనేశా చటుక్కున.

"ఆఁ. అదే చెప్పాలనుకున్నా. తర్వాత" అని బండిని ముందుకు పోనిచ్చాడు భాను.

"నేను చాలా దురదృష్టజీవిని. నా రాతకి సుఖం కూడానా! సుఖపడాలిసిన గీతే ఉంటే ఈయన్ని ఎందుకు పెళ్లి చేసుకొనే దాన్ని? భానూ! నా వివాహం ఒకపొరబాటు - అతనికిగాని, నాకు గాని సుఖంలేదు. ఈ నాలుగేళ్లు ఎలాగడిపానో! ఇక ముందు ... కారుచీకటి. భవిష్యత్తంతా నిరాశామయం. ఎటూ పిసరంతైనా వెలుగు కానరావడం

లేదు. పెళ్లి కాకముందు నాలో ఉన్న హుషారు, ఉత్సాహం, ఆనందం, అనురాగం - అన్నీ ఇగిరి పోయాయి. ఆ మంచి రోజులన్నీ గడిచిపోయాయి. మళ్ళీ అవి రావా? భానూ! లెక్కలేనన్ని ఎన్ని రాత్రిళ్లు నడిరేయిదాకా పడకమీదపడుకొని వెక్కి వెక్కి ఏడ్చానో, ఎవడికి తెలుసు? కాని నా కన్నీళ్లకు విలువ ఏముంది? నా దిగులుకనే వాడు వినేవాడు ఎవడు?

మధ్యాహ్నం వేళల అందరు విశ్రాంతి తీసు కుంటుంటే సామానుల గదిలోకిపోయి పెట్టెమీద కూర్చొని నీతో ఎన్ని సంగతులు మాట్లాడానను కున్నానో? నువ్వు విన్నావా? చెవులుంటేగా నీకు? నాకు పిచ్చి ఎత్తదుగదా భానూ!

సాయంకాలం పూట మా అవరణలో ఒక్కతెనే పచార్లుచేస్తూ ఉంటాను. ఒక తులసికోట ఉంది. దానికి నా గోడు మొరపెట్టుకుంటూ ఉంటాను. అది జడపదార్థం. చేతనంతో కూడుకునిఉన్న నా దుఃఖం దానికి బోధపడుతుందా? పగటి వేళల సూర్యుణ్ణి, వెన్నెల రాత్రిళ్లలో చంద్రుణ్ణి, చీకటి రాత్రిళ్లలో నక్షత్రాల్ని చూస్తూ, ఎంత బాధతో వాటి ముందర నా ఆవేదన వెళ్లబోసుకుంటానో నీ కెల్లా తెలుస్తుంది?

"వెర్రిచెల్లి" అని పెదాలువిరిచి ముసిముసి నవ్వులు నవ్వుకుంటున్నావా - ఇది చదువుకుంటూ? అవునులే, ఎలుకలకు ప్రాణసంకటం. పిల్లులకు చెలగాటం! ఇక్కడ నాతో మనసిచ్చి మాట్లాడే దిక్కులేదు. సుఖం, సంతోషం, సంతృప్తి ఇచ్చే వస్తువులేదు. నవ్వుతూ మాట్లాడేవాళ్లు, సరస సల్లాపాలు ఆడేవాళ్లు, నా లలితకళల రుచి చవిచూచే వాళ్లు, ఎవ్వరూలేరుగదా. వంటచేసుకుంటూ - మరచిపోయాను - ఈ మధ్యనే మా నాయరు తన దేశం వెళ్లాడు సెలవుతీసుకొని. వంటచేయడం నా వంతు. అన్నం కుతకుత ఉడుకుతూనే ఉంటుంది.

"ఆశ నిరాశభయీ, కరూఁ క్యా? ఆశ నిరాశ భయీ" అని పాడుతాను. గట్టిగా 'ప్రేంకా నాతా ఛూటా." ఆ పైన "కబ్ తక్ నిరాశకీ అంధియారీ" ఇల్లా పాటలమీద పాటలు సైగల్‌వి పాడేస్తూనే ఉంటా.

ఈ పిచ్చిరాయుళ్లంతా ఇది బండచాకిరి చేస్తూ ఉందిగదా ఏంపాడుకుంటే మనకేం! అని అనుకుంటూ ఉంటారు. వాళ్ళతిండి కార్యక్రమంలో లోటు ఉండదుగా _ కాఫీ, ఫలహారాలు, భోజనాలు, మళ్ళీ కాఫీ, కీఫీ. ఇంకేం కావాలి వీళ్లకు? ఈవెర్రిబాగులది ఏదో అస్తమానం పాడుకుంటూ ఉంటుంది.

మనకేం నష్టం? అనివాళ్ల ఉహ. చూశావా ఎంత స్వార్థపరులో? తెలివి తక్కువ దద్దమ్మలు కూడాను. రేయింబవళ్లు ఇరవైనాలుగు గంటలూ మంటలో మాడిపోతూ ఉన్నానే_దుర్భర నరక యాతన అనుభవిస్తూ ఉన్నానే! వాళ్ళకు చీమకుట్టినంతైనా లేదుగదా. చీకట్లో కిటికీ దగ్గర నిలబడి శూన్యంలో చూస్తూ పాడిన పాట ఏమిటో చెప్పు, చూద్దాం. పందెం - కనుక్కో. ఉహూఁ బుర్ర గోక్కుంటున్నావా? ఓడి పోయావులే. నీ జేజి దిగిరావాలి చెప్పడానికి.

"ప్రీత్ మేఁహై జీవన్ జోఖం" అన్న పాటోయి ఏదో కూనిరాగం తీస్తూఉందిలే అని భావించే ఈ ద్విపాద పశువులకు ఏ మర్మమవుతుంది? కటికకసాయివాళ్ళు కారూ వీరందరూ?

పచ్చపచ్చగా చక్కగా పెరిగిన చెట్లు చేమలు హాయిగా స్వేచ్ఛగా ఎగిరిపోతున్న పావురాల జంటలు, చిలకా గోరింకల్లా విహరిస్తున్న దంపతులు సినీమాలు, నీఫొటో _ ఇటువంటివి తిలకించినపుడు నాలోనుంచి ఏదో చెప్పనలవిగాని బాధ, వ్యథ, పైకి ఉబికి వస్తున్నట్లుంది భానూ. అది నీకు వ్యక్తపరచడం ఎల్లా? నేను కవయిత్రిని గాని అయి ఉంటేనా? కటికరాళ్లు కరిగేలా ఒక కరుణరస భరిత కావ్యం అల్లేదాన్నిగదా! 'అపిగ్రావా రోది

తృప్తి, దశరథి 'వజ్రస్యహృదయం' రుజువయి ఉండేది గదా.

నా భర్తగారు ఎటువంటివాడో తెలుసా? ఆయన ఘనమైన కార్యక్రమం, దిన చర్య చెప్పనా! "పొద్దు ఎక్కిన తర్వాత ఎనిమిది గంటలకు అయ్యగారు పక్కమీదనుంచి లేస్తారు. కాఫీ సేవనం నిత్యకృత్యాలు, స్నానం ముగించుకుంటారు. కోటు, ప్యాంటు, నెక్ టైలతో ముస్తాబవుతారు. మిల్లుకు పోతారు కారులో. నీకు తెలుసుగా ఆయన మిల్లు యజమాని అని. అందువల్లనే కామోసు ఫ్యాక్టరీ యంత్రంలాగా మొద్దుబారి రసాలు అన్ని కరిగి పోయాయి ఆయనలో. ఒకటే యావ. డబ్బు, డబ్బు, డబ్బు. వెధవ డబ్బు! ఒకటే కూడబెట్టడం మంగళగిరి పానకాల రాయుడులాగా. ఇంకో చిత్రం చూచావు భానూ! ఈ కరువు రోజుల్లో మా మిల్లు కూలీలు జీతాలు ఎక్కువ చేయవలసిందని వేడుకున్నారు — సంఘం పెట్టుకున్నారుగా. ఈయన, తతిమ్మా మిల్లు యజమానులు బిరబిగనీ కూర్చున్నారు. రోగం కుదిర్చారు లేవాళ్లు. సమ్మె చేశారు. చివరికి యజమానులు రాజీ చేసుకున్నారు. చీకటి వ్యాపారంగూడవుంది ఈయనకు. మిట్ట మధ్యాహ్నం ఇంటికి చేరుకుంటారు. సరే తిండి, ఆ తర్వాత పేకాట గదిలోకి వెళ్తారు, మళ్లీ ఏ క్లబ్బుకో వెళ్లడం. రాత్రి 11 గంటలకు రావడం, మింగడం, గదిలోకి రావడం ... ఛీ ఛీ, ఏం చెప్పను నా పాడు బ్రతుకు!

అబ్బబ్బ! వాళ్లేమో ఇష్టంవచ్చినపుడు సినీమాలు చూస్తారు. స్నో సీసాలు, క్రీములు, సిల్కు చీరలు నా మొగాన పారేయడం. నేను సినీమాకి వెళ్లవచ్చు. కాని నాతో రావడం అనేది లేదు గదా. నేను తుఫానులో క్షుబ్ధసాగరంలా మథన పడుతూ ఉన్నాను. నాది ఒక బ్రతుకేనా!"

ఇంతలో భరత్ మొగంవైపు చూచాను. స్తబ్ధుణ్ణి అయినాను. అతను మానవుడా, మ్రోడా! అతని వదనంపై సానుభూతి చిహ్నాలు లేవు. మొగం చిట్లిస్తున్నాడు. ఆవులిస్తున్నాడుకూడ. భాను చదువుతూనే ఉన్నాడు.

"నాకు శాంతి కావాలి, శాంతి, విశ్రాంతి, ప్రశాంతి కావాలి. ఈ మంట ఆరిపోదా? వంట చెయ్యడం, బండచాకిరీ చేయడం, చాటుమాటుగా ఏడ్వడం, కుళ్ళికుమిలిపోవడం, కూనిరాగాలు తీస్తూ ఉండడం — ఇల్లా ఎన్ని రోజులు?

కాదు భానూ! ఈ శోక సముద్రంలో మునిగి పోకుండా ఒక తెప్ప ఉంది. అదేమిటో తెలుసా? నీకు రాస్తూ ఉండడం — నా దుఃస్థితిలో మరెవరైనా ఉంటేనా? పగవాడికికూడ వద్దు — ఈ పాడు ఆడ జన్మ. ఈ పాటికి ఎవడితోనో లేచిపోయేది. చీటికి మాటికి నీ పేరు పునశ్చరణ చేస్తూ ఉన్నాను. అందువల్ల నాకు కొంత శాంతి. ఈ ఆసరా నా నుంచి కొంపదీసి లాగేసుకోవుకదా!"

పానకంలో పుల్లలా "అరేయి! అంతూ పొంతూ లేదేరా" పల్కాడు బావుల చేంతాడులా అన్నాడు భరత్.

"చివరప్యారా" అన్నాడు భాను.

"చిన్నప్పటి రోజులు జ్ఞప్తికివస్తున్నవి. చీకూ చింతా లేదు. మాయమర్మం తెలియదు. ఆడుతూ పాడుతూ బడికి వెళ్ళడం, సాయంకాలం తోటల్లో షికార్లు, కలిసిమెలిసి పాటలు పాడుకోవడం — భానూ! ఎంతత్వరగా ఆ సంతోష దినాలు గడిచి పోయాయి? వాటిని నెమరువేసుకుంటున్నాను. ఇప్పటి, ముందు రాబోయేటి కష్టాన్ని సహించేందుకు సిద్ధం. నా తమ్ముడూ! నీ Final yearగా ఇది! బాగా చదువు, నీజాబులనుంచి నే పొందే ఆనందం అపరిమితం. అయితే భానూ; నేనెలాటి శూన్య జీవితం గడుపుతున్నానో......

ఉత్తరం పూర్తి అయింది. నాకళ్లు చెమ్మగిల్లాయి. ఇంక యుద్ధం సాగింది నాగదిలో, వాగ్యుద్ధమే లెండి.

భరత్ మొదటి బాణం వేశాడు!" ఏమిటిరా ఈ తలాతోకలేనిమాటలు ; ఉన్నత విద్యచదివిన ఫలితం ఇలా ఉంది. హృదయంట! వేదనట! యాతనట! సానుభూతట! కన్నీళ్లుట! లలితకళలుట! ఏమిటి ఈ అర్థంపర్థలేని ఉన్నతప్రతాపాలు. ఒకసారి అగ్నిసాక్షిగా పెళ్లాడినతర్వాత, కిక్కురుమనకుండా, ముక్కునపేనులా, సంసారంగడపాలి. అంతేగాని ఈగాలిలో రెక్కలులేకుండా ఎగిరిపోవడమేమిటి? భర్తదైవం. అతడే సర్వస్వం. అరే భానూ! ఇటువంటి ఉత్తరాలు అందుకొని సగం నువ్వు ఆవిణ్ణి చెడగొట్టుతున్నావు? నా మాటవిని, "అమ్మాయీ! జరిగింది మరచిపో. త్రికరణ శుద్ధిగా భర్తకి, భర్తవైపువాళ్లకు సేవచేస్తూ ఉండు. ఆ సైగల్ పాటలు పాడడంమాని, త్యాగరాజ కృతులు నేర్చుకో. నీకు ఇహం, పరం, రెండు లభిస్తవి." అని ఒకముక్క రాసి పారేయి. దానితో చేతులుకడుక్కో!

భానుకి పాపం ఆ భాణం ఘాటుగాతగిలింది. దిమ్మదిరిగింది. మొగం తెల్లముతాబాకాల్చింది. నావైపుదైన్యంగాచూచాడు, కనీసం నేను భరతతో ఏకీభవించను అనేధీమాతో.

భరత్ పలుకులు ములుకులై నన్నుగూడగాయపరిచాయి. నేనూ రంగంలోకి దూకానూ

"అరేయి భరత్! నువ్వు దురుసుగా" మాట్లాడుతున్నావు. ఆవిడ బాధ నీకెల్లా అర్థం అవుతుందిలే, పంటి నొప్పితో బాధపడనివానికి ఆ బాధ ఎల్లా తెలుస్తుంది? నువ్వు, ఆడజన్మఎత్తి, ఆ పరిస్థితుల్లోపడితే, తెలిసివచ్చేది?"

నాకు ఆవేశం హెచ్చింది. బిగ్గరగా, ఆమెయే నా స్నేహితురాలైతే, నా చెల్లెలే అయితే, లేక నా కూతురయితే, నేను ఆమెకిచ్చే సలహా ఏమిటో తెలుసా? "అమ్మాయి, ఇల్లా కుళ్ళి కుమిలిపోతే ప్రయోజన మున్న - భర్తతో నిర్మొగమాటంగా చెప్పేశాయి, "అబ్బాయి! మన స్వభావాలు వేరు. మనం కట్టే విలువలు వేరు. మన తత్వాలు వేరు. నీతో నేనిక కాపురం చెయ్యలేను. ఇక నన్నుపోనియ్యి. నీకు వండి, చాకిరిచేసి కేవలం నీ కామాన్ని తీర్చే మొద్దులాంటి ఓ అమ్మాయిని పెళ్లిచేసుకో బాబూ, నమస్కారాలు. రాంరాం" అని చెప్పేసి విడాకులు ఇచ్చివేసి పైచదువు చదివి ... "

"మజాచేస్తూఉండు" అని వెటకారంగా భరత్ నా వాక్యం పూర్తిచేసి సకిలించాడు.

నాకు ఒళ్లు మండింది, చెప్పొద్దూ? వాడిమీద విరుచుకుపడ్డాను, "ఏమిటిరా నీ వాగుడు? కొసదాకా నే చెప్పేది వినకుండానే అనవసర ప్రసంగంచేస్తావు? స్వావలంబినివై మహిళల అభివృద్ధికై ఏదుర్గాబాయమ్మగారిలాగునో పాటుబడి జన్మసార్థకంచేసుకో అని సలహాయిచ్చేవాణ్ణి" అని ముగించాను.

"మీ ఇద్దరితోనూ నేను ఏకీభవించను" అన్నాడు భాను తాపీగా.

నాదేమో విప్లవ పంథాట - భరత్‌ది అభ్యుదయ వ్యతిరేకపంథాట. ఆమె అల్లానే భర్తవద్ద ఉండాలనీ, అదే తపస్సు అనీ, కాని తన ఆవేదన వెళ్లబోసే ప్రాథమిక హక్కు ఆమెకు కలదనీ తేల్చాడు.

తుఫాను చెలరేగి శాంతించింది. రమాదేవి అనే ఇంకో ఆవిడమూడ భానుకు ఉత్తరాలు రాస్తూ ఉంటుందని నాకు తెలుసు.

"భానూ! ఒక రకం జీవితం తెలుసుకున్నాం, మొన్న ఆ రమాదేవివద్దనుంచి జాబు వచ్చింది అన్నావే. అది చదువు విందాం" అని నేనన్నాను. భాను తన జేబులోనుంచి ఇంకో ఉత్తరంతీసి చదువనారంభించాడు.

నేను ఈ ఉత్తరాల్ని జోడించి ఒక కథానిక రాద్దాం అని ఆలోచనలోపడ్డాను.

"సోదరా!

నీ జాబు చేరింది. నేను కులాసా. మాపార్టీ పని ఏమిటో అర్థంకావడంలేదు అని రాశావు. కాస్త మాపత్రికలు చదువుతూవుండు, తెలుస్తుంది. ఆర్. యస్. యస్. వాళ్ళని నాకు తెలుగా. అందాకా

ఎందుకు నీవు ఉన్నచోటకూడ మాపార్టీవాళ్లు ఉన్నారు. మేంసర్వవ్యాపులం. వాళ్ళవెంట ఒక రోజు వెళ్ళి కళ్లు తెరుచుకునిచూడు. నీకు బోధపడు తుంది. కష్టాలు ఎక్కడ ఉన్న అక్కడ మేము హాజరు. కూలీవాళ్లు, రైతులు మొదలగు కష్టజీవుల వాడలలో మేంపనిచేస్తూ ఉంటాం. వాళ్ళకి సంఘాలు పెట్టతాం. యజమానులు చేస్తున్న దాడులకు వ్యతిరేకంగా వాళ్లతోబాటు నిలబడి పోరాడు తున్నాం. రైతుసంఘాలు, వ్యవసాయకూలీ సంఘాలు, చేనేతపని వారి సంఘాలు, టీచర్ల సంఘాలు, N. G. O. ల సంఘాలు - ఇలాంటివి సంఘటితపరుస్తాం. ప్రజాసామాన్యనికి మేలుకూర్చే విధంగా పనిచేస్తున్నాం. మత సామరస్యానికి కృషి చేస్తున్నాం. ఇదంతా పనికివచ్చేపనిగాదా?

ప్రస్తుతం ఇక్కడ సంయుక్తస్త్రీ సంఘాల యాజమాన్యానMilk week(పాల సప్తాహం) జరువు తున్నాం. పేటపేటలో స్త్రీల సమావేశాలు జరుపు తున్నాం. ప్రతిబీదబిడ్డకు, రోగులకు, గర్భిణీస్త్రీలకు మన సర్కారే పాలుసప్లయిచేయాలని మాడి మాండు. దీనికి డబ్బెక్కడిది అనేగా నీ సందేహం? భానూ, మానవాబు దగ్గర ఎంతబంగారం మూలుగుతో ఉందో, దాని విలువ ఎవరూ కట్టలేరు. మా రాష్ట్రంలో పిల్లలమాట అటుంచి, ప్రపంచంలో ఉన్న పేద పిల్లలందరికి పాలు సప్లయిచేయవచ్చు. ఏండ్ల తరబడి ఆబంగారం సద్వినియోగం అవుతే మా ఉద్యమానికి అన్ని పార్టీల పత్రికలు చేయూత ఇస్తున్నది.

ఈ మధ్యనే బాలబాలికల సంఘాలకోసం ఒక నాటిక వ్రాశాను. బాలబాలికలే ఆనాటికి ఆడారు. చాలా బాగుందని మెప్పులు పొందాను.

నా సొంత గొడవ నీకు చెప్పలేదని నిష్ఠూరంగా వ్రాశావు. సరే, విను. మాతండ్రి ఒకడాక్టరు. ప్రాక్టీసు బాగానే ఉండేది. మాఅమ్మకు ఆయనకు పడేదిగాదు. ఒకసారి విసువుజనించి ఇల్లు వదలి వెళ్ళి పోయాడు. మళ్లీ పత్తాలేదు, అప్పుడో నాది చిన్న తనం. చదువులో ప్రవేశించాను. ఇంటరు చదువుతూ ఒక పురుష పుంగవునితో పరిచయంగలిగింది. ఆ పరి చయం ప్రణయంగా పరిణమించింది. తర్వాత మామూలు విషాదం - ఇంకో ఆమెను పెళ్ళిచేసు కున్నాడు నన్ను మోసంచేసి. నాకు దెబ్బ బాగా తగిలింది. జీవితంమీద విరక్తి జనించింది. ట్రైనింగు ప్యాసయి టీచరుగా కాలంగడిపేదాన్ని. పార్టీ చట్టం వ్యతిరేకంగా ఉన్న రోజులలో ఆ పార్టీతో సంపర్కం ఏర్పడింది. తరువాత పార్టీ సభ్యురాల్ని అయ్యాను. ఇంక ప్రజాసేవలో మునిగిపోయాను. మొదట ఈ నగరంలో ఒక్కర్తెను. ఇప్పుడు యిరవై మంది కార్యకర్త్రులం. జీవితం కృతకృత్యమై నట్లుంది. అనిర్వచనీయ ఆనందం అనుభవిస్తున్నాను. నిరాశ నిస్పృహాలు తొలగిపోయాయి. హృదయ కుహరంలోనుంచి నూతన జీవిత ఉద్భవించి నట్లుగా తోస్తూఉంది. ఇప్పుడు చీకు చింతలు మచ్చుకైనా దరికిరావు. పగలల్లా ఏదో ప్రజల పని చేస్తూ ఉంటాను. అలసిసొలసి ఇంటికి చేరుకుంటాను. పడకమీదవాలగానే కమ్మటినిద్ర పట్టుతూఉంది."

భరత్ "భానూ! పోయినయేడు బి. ఏ. పరీక్షకు ప్రైయివేటుగా కూర్చుంది; నువ్వు ప్రైవేటు చెప్పావు. ఆ మేరా యీమె!" అన్న జిజ్ఞాస చేశాడు.

"అవును. ఆమెయే" అన్నాడు భాను చదువుతూ

"ఎందుకోగాని భానూ! ఆ కాశీ హిందూ విశ్వ విద్యాలయం అంటే ఒక వ్యామోహం ఏర్పడింది. అక్కడి సుందర శిల్పభరిత భవనాలు, బారులుతీరిన దారులు, తోటలు, అక్కడి సూర్యోదయం, సూర్యాస్తమయం - ఆ ప్రాకృతిక సౌందర్యం - నేను ఒంటరిగా ఉన్నప్పుడు నన్ను చుట్టిముట్టేస్తూ ఉంటవి.

అది లఘురూపంలోఉన్న మన భరత్ వర్షం. ఎగిరి అక్కడ చావాలని అని ఉంది. కాని ఇప్పుడు తీరికలేదు. కాని మా సోషలిస్టు లక్ష్యం సిద్ధించిన తదుపరి - నేను బ్రతికే ఉంటే - నా చివర రోజులు ఆ గంగమ్మతల్లితీరాన గడుపాలని నా అభిలాష.

క్షమించు. ఒక తోడు దొరికింది - అయితే భాను! నన్ను నమ్ము - నేను పరమానందభరితుడ యినాను."

ఉత్తరం పూర్తి అయింది. అందరం ఆలోచనా సముద్రంలో పడిపోయాం. నేను సిగరెట్టు వెలిగించాను.

# కష్ట జీవిక ధనం

శ్రీమతి S. K. నిరుపమగురుకులు



పంటలు, వంటలుమీది!
కరువు, బరువుమాది!

మిద్దెలు, మేడలుమీది!
గుడిశెలు, అడవులుమాది!

పేరు, ఫలమూమీది!
శ్రమ, అరుపులుమాది!

నగలు డబ్బుమీది!
కష్టం, నష్టంమాద!

సుఖమూ, పరువూమీది!
దుఃఖమూ, నిరాశలుమాది!

రజతోత్సవాలు, స్వర్ణోత్సవాలుమీది!
ఏడ్పులు, పెడ బొబ్బలుమాది!

కుర్చీలు, పట్టుపాన్పులుమీది!
కటిక, రొంపి నేలలుమాది!

సిల్కులు, చీనాంబరాలుమీది!
చినిగిన పేలికలు చిడుములుమాది!

కోపం, రోషంమీది!
దయ, కరుణమాది!

అధికార అనుమానాలుమీది!
అవమాన, అభిమానాలుమాది!

సకల సంతోషాలుమీది!
విచార, అశాంతులుమాది!

పప్పులు, మిఠాయిలుమీది!
ఉప్పు అంబళ్లుమాది!

మాకు కోపం వుండేవుంది:
కానీ మేంశాంతంగా వుండాలనివుంది!

మీ దయతో మేం బ్రతకాలనివుంది!
మీకరుణతో మేం జీవించాలనివుంది!

కానీ మంచికాలం ముందుంది.
అది చేతికందినపుడు చెప్పాలనివుంది!

రాస్తానప్పుడు సంతోష గీతికలు
వేస్తానప్పుడు సంతోష పాచికలు!



# వెలుగు చీకట్లు

కుమారి శిరిపురపు విజయ



"ఎంతదూర మీ పయనం
అంతులేని యీ గమనం"

మనం ఏదయినా ప్రయాణం చెయ్యదలచుకొంటే దానికంతు మనకు తెలుస్తుంది. మన మెక్కడకు వెళ్లాలో ముందనుకునే బయలుదేరతాం. కానీ ప్రపంచంలో ఒక రకం మనుష్యులున్నారు చూశారూ? వారి ప్రయాణానికి దూరమూ తెలియదు. వారి గమనానికంతూ తెలియదు.

ఆ కోవలోకి చెందినవాడే శర్మ. శర్మ చిన్నతనంలో చాలా తొందరమనిషి. రోజులు దొర్లుతున్న కొద్దీ ప్రపంచాన్ని అర్థంచేసుకోగలుతున్నాడు. శర్మకి తండ్రిలేడు. ఒక చెల్లాయిమాత్రంవుంది. తల్లి కాంతమ్మగారికి ఎప్పుడూ ఏదో అనారోగ్యమే. శర్మ తండ్రి బ్రతికివుండగానే బి. ఏ. పూర్తిచేశాడు. అదికాక తండ్రి పరమపదించగానే చదువుకి తిలోదకా లొదిలాడు. అదికాక యింకా చేసేదిమాత్ర మేముందిలెండి? పోనీ వెనక ఎవరైనా సంసారం చూసిపెడతారంటే ఎవరూలేరు. లేక వెనక ఆస్తేమయినావున్నదా అంటే అది అంతకంటేలేదు. రెక్కాడితేనే డొక్కాడతాయి అనే దగ్గరుంది వారి సంసారం. చెల్లెలు ఇంటరు చదువుతుండగా తండ్రిపోతే ఆమెకూడా చదువుకు స్వస్తివాచకం పలికింది. శర్మ కష్టపడి తొందరలోనే ఏదో ఆఫీసులో వుద్యోగం సంపాదించుకోగలిగాడు. ఆ వచ్చే నూటయిరవై రూపాయలతో ఎలాగో సంసారాన్ని గడపగలననే ధైర్యం అతన్నందుకు పురికొల్పింది.

ఇందిర చాలా అందంగా వుంటుంది. శర్మ ఒక మాదిరిగా వుంటాడు. ఇందిరంటే శర్మకెంతో ప్రేమ. ఆమె రూపం ఒక్క నిమిషంకూడా తనకి కనిపించకపోతే సహించలేకపోయేవాడు. అతను వుదయం నిద్రలేవగానే ఇందిర ముఖంచూసే మంచందిగేవాడు. తల్లి కాంతమ్మగారెప్పుడైనా "ఇందిర అత్తవారింటికి వెళ్లాక ఎవరిముఖం చూస్తావురా బాబూ" అంటే ఇందిర జవాబిచ్చేది "సుందరి ముఖం" అని. అది వినగానే శర్మ అటుతిరిగి పడుకునేవాడు.

సుందరి శర్మకి మేనమామ కూతురు. ఫోర్తుఫారంవరకూ చదివింది. ఆ అమ్మాయి పుట్టినప్పటి నుండి శర్మ భార్యేనని ఊరూనాడూ ఏకమయి ఏకకంఠంతో పలికింది. పలకడమేమిటిలెండి. భార్య అయిపోయినట్లే భావించింది. సుందరికి తల్లీ తండ్రీ వున్నారు. శర్మ తండ్రి చనిపోయినప్పుడు వారంతా వచ్చి పరామర్శించి వెళ్లారు. శర్మకి వుద్యోగం దొరికాక పెండ్లి విషయం కదిలించికూడా చూశారు. రెండు ప్రక్కలా సుముఖులుగా నుండడంవల్ల పెండ్లికూడా ఏ అవాంతరాలూ లేకుండా అయిపోయింది. సుందరి కొక తమ్ముడుకూడా వున్నాడు. పిల్లలిద్దరే అవడంవల్ల పెండ్లవగానే సుందరికి ఆస్తిలో సగం భాగం యిచ్చారామె తండ్రి. సుందరి కాపరానికి రాగానే ఆ యిల్లంతా కలకల్లాడడం మొదలుపెట్టింది. సుందరి, ఇందిర లిద్దరూ సమవయస్కులూ, మేనత్త మేనమామ బిడ్డలూ అవడంవల్ల తొందరలోనే ఒకరినొకర అర్థంచేసుకోగలిగారు. ఆమె వచ్చాక మళ్లా యిందిరను కాలేజీలోచేరమని ప్రోత్స

హించింది. తల్లి పెండ్లిమాటెత్తినప్పుడు అన్నా వదిన లిద్దరూ ఆ విషయం ఇందిరకే వదలివేశారు. ఆమె యింకా చదువుకుంటా నంటోంది. చదువు పూర్తయాకా ఆమే తనకు సరియైన వరుని ఎన్నుకుంటుందని వారి యభిప్రాయం. ఈ కాలంలో చదువుకొనే ఆడపిల్లల తలిదండ్రులు కొందరైనా ఈ యభిప్రాయాన్నికలి వున్నారనడంలో నేనంత పొరపాటుపడడం లేదనుకుంటాను.

అనుకున్నట్లుగానే ఇందిర ఇంటరు పూర్తిచేసి బి. యస్. సిలో చేరింది. ఆమెకి చదువంటే శ్రద్ధ వుంది. దానికి తగినట్లు మంచి తెలివితేటలుకూడా వున్నాయి. ఈ రెండూ ఒకచోట మిళితమైనప్పుడు పైకిరావడంలో సందేహమేముంది.

ఇందిర బి. యస్. సి మొదటి సం॥లో వున్నప్పుడు ఆ సంవత్సరం వార్షికోత్సవం జరిగింది. ఫంక్షన్సుకి వెళ్లడమంటే, ఆమెకు చాలా సరదా. సినిమాలంటే పిచ్చికూడా యెక్కువే. ఆ రోజు కొన్ని నాటకాలుకూడా జరిగాయి. ఒక ప్రోగ్రామ్‌కి ఇంకోదానికి మధ్య వ్యవధిలో కొన్ని మధుర గాత్రాలు అక్కడున్న కాంతల సుశ్రూతలూగించాయి.! పురుషులను మైమరపింపజేశాయి. వృద్ధులు వహ్వా అని బుర్రలూగించారు. బాలురు చప్పట్లు చరచి ఎగిరి గంతులువేశారు. ఒక గాత్రాన్నిమాత్రమెవరు మరచిపోలేకపోయారు. ఆ పాటాగిపోగానే 'ఒన్సుమోర్' అని రిక్వెస్టులు వెళ్లాయి. ఆ గాత్రం మరల తీయగా సాగింది. అబ్బా! అతనికా కంఠం భగవంతుడెలా యిచ్చాడు? అందరికీ అలాంటి కంఠం లేదే. ఆ టాలెంట్ భగవంతుడు ఒక్కొక్కళ్లకిస్తాడు. అందరికీ ఇవ్వడే. ఆ భగవంతునికంత వల పత్యందేనికి? అనే ప్రశ్నలే అందరిలోనూ ఆ క్షణంలో మొలకెత్తాయి. అందరినీ యింతమైమరపించినగానం స్వతహాగా పాటలంటే చెవికోసుకునే ఇందిరకి మాత్రం సంతోషదాయకంకాదా? అందరికంటే ఆమె మరో రెండు మెట్లకుపైనేవుంది. పాట పాడినవ్యక్తి కర్టెనుకు వెనుకనుండే పాడడం జరిగింది.

పాట రెండోసారికూడా పాడాక అతనిపేరు మైక్‌లో చెప్పారు. "సుధాకర్ బి. యస్. సి. మూడవ సంవత్సరము" అని. "సుధాకర్? థర్డ్ ఇయర్?" అని అప్రయత్నంగా రెండు మాటలు ఇందిర పెదవులనుండి పైకివెలువడ్డాయి. బహుశః! ఆ మాట లితరులు వినేంత గట్టిగా అని వుండదు. ఆమెకు సుధాకర్ పేరు విన్నగుర్తువున్నదికాని మనిషెవరో ఎంత ప్రయత్నించినా జ్ఞాపకం చేసుకోలేకపోతోంది. పైగా తన క్లాస్‌మేటు మరునాడెలాగయినా ఆ అబ్బాయిని చూడాలనుకుంది. అంత చక్కగా పాటపాడిన అబ్బాయి ఎలా వుంటాడో చూడాలనామె మనస్సువ్విళ్లూరిపోతోంది. మరునాడు క్లాసులో అటెండెన్సు పిలచేటప్పుడు ఎంతో జాగ్రత్తగా వినసాగింది. ఆడపిల్లలు మొదటివరసలో కూర్చొని వుండడంవల్ల మనుష్యుల ముఖాలు చూడడానికి వీలులేకుండావుంది. చివరికామె కాతురత మరీ ఎక్కువయింది. ఆమె హృదయమామెకు తెలియకుండా తొందర తొందరగా కొట్టుకోవడం మొదలు పెట్టింది. చివరికొచ్చిందా నామధేయం.

"సుధాకర్"

"యస్ సార్" - తీయని కంఠం జవాబిచ్చింది. ఆమె వెంటనే వెనుతిరిగి చూడాలనుకుంది. కాని ఆమెకెందుకో భయంవేసింది. అలా చెయ్యలేక అవకాశం జారవిడుచుకుంది. ఆ సాయంత్రం క్లాసులు అయాక రోజూలాగే ఇందిర లీలలు కలిసి నడిచే యింటికి వెళ్తున్నారు. అప్పుడే కాలేజీ విడిచి పెట్టడంవల్ల విద్యార్థులంతా గుంపులు గుంపులుగా వెళ్తున్నారు. ఒక ప్రక్కనుండి లీలా ఇందిరలుకూడా తలలు వంచుకుని నడిచిపోతున్నారు. ఒకసారి అప్రయత్నంగా లీల తలెత్తి చూచింది. ముందెవరో అబ్బాయి ఒక్కడే నడిచిపోతున్నాడు. లీల కొంచెం తొందరగా నడిచి ఆ అబ్బాయిని "బాజీ" అని ఉద్దేశించి పలికింది. ఆ అబ్బాయి వెంటనే ఆగి లీలవైపుచూచి చిరునవ్వునవ్వాడు. "ఏం లీలా! ఈ మధ్యన కనిపించడం మాని

వేళావే!” అని పల్కరించాడు. “ఇంట్లో అంతా కులాసాగానే వున్నారని తెలుసుకుని తర్వాత కనుపిస్తాలే అని చెప్పి లీల తిరిగి ఇందిర దగ్గరకొచ్చింది. అతను వెళ్ళిపోయాడు. లీల చెప్పింది తను తన చిన్నాన్నగారి అబ్బాయని వాళ్ళక్లాసే చదువుతున్నాడనీ.

“బాజీ అనే పేరునే నెప్పుడూ వినలేదే” అంటుంది ఇందిర.

“బాజీయా! బాజీ ముద్దుపేరు. అతని అసలు పేరు సుధాకర్. పాటలు బాగాపాడతాడు. మొన్న “కాలేజిడే”కికూడా పాడాడు ”అని ఏమేమో చెప్పుకుపోతోంది. కాని సుధాకర్ అని వినగానే ఇందిర ముఖ కవళికలు మారాయి. “అరె! ఆ అబ్బాయిని సరిగ్గా! చూడలేదే. అతనే సుధాకర్ అనితెలిస్తే ఇంకోసారిచూసేదాన్నే!”అనుకొన్నది. ఇందిర ఏదో ఆలోచిస్తోందని కనిపెట్టి లీల “ఏమిటిందిరా. ఏమిటాలోచిస్తున్నావు?”అని పల్కరించింది.

“అహా; ఏమీలేదు. సుధాకర్ నీ కన్నయ్యా? నువ్వెంత అదృష్టవంతురాలవు” అని అనుకొంటున్నాను

“ఏం! పాటలు పాడడం వచ్చినందువల్లనే అతనంత గొప్పవాడా యేమిటి?” అన్నది లీల. అందుకిందిర “ఎవరికయినా అభిరుచి వుండి వాటి విలువ తెలిస్తేనే కదా అభినందించ కలిగేది” అనుకుంది.

లీల యింటికి వెళ్తూ ఆదివారంనాడు ఇందిరని వాళ్ళయింటికి ఆహ్వానించింది. ఇందిర కూడా దగ్గరలోవున్న వాళ్ల యింటికి వెళ్ళిపోతుంది. ఆ రాత్రి భోజనం చేసి అన్నతో కొంతసేపు మాట్లాడాక చదువు కుపక్రమించింది. కాని ఒక్కపేజీ తిరగడంలేదు. మధ్యలో సుందరి ఎందుకో ఆగదిలోకి వస్తుంది. ఇందిరేదో పరధ్యానంగా ఆలోచిస్తూవుండడంవల్లా మూరాకను గమనించదు. సుందరి పలుకరించేసరికి ఉలిక్కిపడిచూస్తుంది. వెంటనే మన ప్రపంచంలోకి “వచ్చి ఏమిటివదినా” అని పల్కరిస్తుంది.

“ఏమిటిందిరా! ఎవరిగురించి నీ ఆలోచనలు. కొంపదీసి ఎవరయినా అబ్బాయి నీ హృదయంలో దూరాడా ఏమిటి తెలియకుండా! అంత తంటాలు పడుతున్నావు” అంటుంది చిలిపిగా.

ఇందిరకూడా “ఛీ! ఏమిటమ్మా అలాటిమాటలు” అని నవ్వుతుంది.

మరునాడు మధ్యాహ్నం ఇంటర్వెల్ లో లీలా ఇందిరలు వెయిటింగ్ రూమ్‌లో కూర్చుని వుండగా బాజీవచ్చి పిలుస్తాడులీలని. సుధా వాళ్లమ్మగారేదో కబురు పంపడంవల్ల అది చెప్పడానికొస్తాడు సుధా. లీల ఇందిరని పిలుస్తుంది బయటికి. ఇందిర నాడి చాలా జాస్తి అవుతుంది అడుగులో అడుగు వేసుకుంటూ వస్తుంది బయటికి. లీల “బాజీ! ఈ అమ్మాయి ఎవరో తెలుసా? మనక్లాస్‌మేటు. ఇందిర”అని పరిచయంచేస్తుంది. సుధాకర్ విశాల నేత్రాల ప్రశాంతమైన చూపులు ఇందిర మీదకు ప్రసరిస్తాయి. ఇందిరకు నమస్కారంచేస్తాడు. ఇందిరకూడా ప్రతినమస్కారంచేసి అతని ముఖం వైపు చూసి వెంటనే తనదృక్కులు లీలవైపుకు తిప్పుకుంటుంది. ఆమెకా క్షణంలో ఏవో చెప్పరాని భావాలు హృదయంలో ఉప్పొంగుతాయి. తనెన్ని రోజులనుండో చూడాలనుకున్న మధుర గాయకుడు తనకెదురుగా నిలబడినా ఆమె అతని ముఖం చూడడానికైనా ధైర్యం చాలకపోయింది. అతనుకూడా ఆమె పరిస్థితిని గమనించి అతనే మాట్లాడాడు.

“మిస్ ఇందిర! బాగా చదువుతున్నారనుకుంటాను. మీరు క్లాస్‌మేట్ అని తెలిసినా ఇంతవరకూ మాట్లాడే అవకాశం లేకపోయింది” అని.

“నాకుకూడా మిమ్మల్నింతవరకూ తెలియదండి, మొన్న కాలేజిడేనమాత్రం మీపాటలు విన్నాను”

అంటూంటే ఇందిరకళ్లల్లో ఏదో ఒకవిధమైన మెరుపు చూడగలిగేడు సుధ.

"నా పాటలేమున్నాయిలెండి. స్వతహాగా కోకిలగాత్రులనే పేరుగల మీ నారీమణులు పాడ్తేనే పాటలకు అందంవుంటుంది. మాలాటివాళ్లుపాడితే పాటలో వున్న మాధుర్యంకూడా పోతుంది"

"అలా అని నేనెప్పుడూ అనుకోను. అలాటి టాలెంట్ ఏ ఒక్కరికో భగవంతుడిస్తాడు. అది లభ్యమయింది. అందుకే మీరెంతో అదృష్టవంతులంటాను నేను" అని చిరునవ్వు నవ్వుతుంది.

అతను ఇందిర మాట్లాడుతూంటే ఆమె కదిలే పెదవులని నవ్వినప్పుడా చక్కని పలువరసని మీగడతరకల వంటి ఆ బుగ్గలని బుగ్గపై నవ్వినప్పుడు పడే ఆ సొట్టనీ చూసేసరికి మనస్సేదోలా అయిపోతుంది ఇందిర చాలా అందంగా వుంటుందనామె కనుపించినపుడు అనుకొనేవాడు సుధ కాని అతని కంతవరకే వుద్దేశమూ రాలేదు. ఇప్పుడామెను చూస్తూంటే అతనిలో ఎందుకో మార్పు రావడం మొదలుపెట్టింది.

"సరే వస్తానండి. క్లాసుకు టైమువుతోంది" అని ఇందిరతో "చెప్పి వస్తాను లీలా" అంటూ లీలతో చెప్పి వెళ్లిపోతాడు.

ఆ ఆదివారం ఇందిర లీలావాళ్ల యింటికి వెళ్తుంది. ఇద్దరూ సినిమా ప్రోగ్రామ్‌కూడా వేసుకున్నారు. ఇద్దరూ సినిమాకు బయలుదేరే సమయానికే మరో స్నేహితుని యింటికి పోతూ సుధ పెదనాన్నగార్నికూడా చూసిపోదామని వీరింటికి వస్తాడు. ఇందిరా లీలలు ఎదురవడంవల్ల "ఎక్కడికి లీలా ప్రయాణం?" అని ప్రశ్నిస్తాడు లీల. సుధాకి సినిమాకి వెళ్లాలనేవుంది. కాని వచ్చి పెద్దమ్మగార్కికూడా కన్పించకుండా వెళ్లిపోతే ఏమనుకుంటారోనని భయం. ఆవిడకి కన్పిస్తే ఆవిడకింటి కబుర్లు చెప్పడంలో లీలా వాళ్ళకి టైము అయిపోతుంది. అందులో ఇందిరకూడ వుంది. ఆమెని మొదటిమారు చూడగానే మొలకెత్తిన ప్రేమాంకురం ఈసరికి బాగా నాటిమొక్కయింది. ఈ సదవకాశాన్ని జారవిడవనిచ్చగించడంలేదు మనస్సు. తొందరగా ఎలానో సమాధానం చెప్పకలిగేడు లీలకి "అమ్మతో మాట్లాడి వీలుంటే వస్తాలే లీలా మీరు వెళ్ళండి మీకు టైము అయిపోతుంది. నిరంజన్ టాకీస్‌కేగా!" అని అడుగుతాడు.

"అక్కడే. ఓకే! వెళ్ళిపోతాం" అంటూ లీలా ఇందిరలు అక్కడనుండి సినిమాకి వెళ్ళిపోతారు.

సుధ లీలావాళ్ళ అమ్మగారితో యేవో రెండు మాటలు మాట్లాడి మళ్ళా వస్తానంటూ తనస్నేహితుని గొడవే మరచిపోయి తిన్నగా నిరంజన్ టాకీస్ వైపు త్రోవతీస్తాడు. సుధ వెళ్లేసరికి సినిమా మొదలుపెడతారు. తలుపులువేసేశారు. అంతా చీకటిగావుంది. నెమ్మదిగా టార్చి సహాయంతో లీలా ఇందిరలున్న చోటతెలుసుకుని లీల ప్రక్కన కూర్చుంటాడు. అది ఇంగ్లీషు సినిమా. ఆ సినిమాలో అక్కడక్కడ ప్రణయ దృశ్యాలు వచ్చేసమయానికి ఇందిరకేవో భావాలువచ్చి తెరవైపు చూడడానికి సిగ్గువేసి ఒకసారి లీలపరిస్థితెలావుందోనని ఆమెవైపు చూసింది. లీలమాత్రం సినిమా చూడడంలోనిమగ్నురాలయింది. అదే సమయానికి బహుశః సుధకి కూడా ఆ ఊహే వచ్చివుండవచ్చు. అతనీప్రక్కకు చూడగానే ఆ చీకట్లో నాలుగుకళ్లూ కలుస్తాయి. కాని మరుక్షణమే విడిపోయాయి కూడా, అంతలోకి ఇంటర్వెల్ అవడంవల్ల తలుపులు తెరిచారు. లీల "ఏం! ఇందూ, సినిమా ఎలావుంది?" అని అడుగుతుంది. ఇందిర వెంటనే సమాధానం చెప్పలేక తడబడుతుంది అసలు సినిమా చూస్తేగా ఎలా వుందో తెలియడానికి?

"ఏంబాజీ! సినిమా ఎలావుంది"

"పిక్చరా! ఇంకా పూర్తికాలేదుగా ఇప్పటివరకూ ఫరబాలేదు" అని తప్పించుకుంటాడు.

మగవాళ్ళకి పెట్టింది పేరు. తనలో యేదయినా పొరపాటువున్నా లేనట్లే ప్రవర్తించి పైగా ఏమీ ఎరగని ఆడవాళ్ళమీద రుద్దుతారొక్కొసారి కొందరు ధీమంతులు. అందరూ అలావుంటారని నేననడం లేదు సుమా! ఆ కేటగిరీలోకి చెందినవారి సంగతే నేననడం. అయితే ఆడవాళ్ళల్లో లేరా అలాంటివారు? అని మీరడుగుతారేమో! ఆడవాళ్ళల్లోనూ వుంటే వుండొచ్చు. కాని ఈ విషయంలో మాత్రం ఆడవాళ్ళకి పై చెయ్యే పురుషులు. ఇలాంటి ధీమంతులెంత మందో ఈ విశాల ప్రపంచంలో-ముఖ్యంగా విద్యార్థి ప్రపంచంలో. ఆతర్వాత కాలేజీలో లీలకోరకు సుధ వచ్చినప్పుడల్లా ఇందిరతో మాట్లాడకుండా వెళ్ళేవాడు కాదు. వారిస్నేహం రానురాను వృద్ధిపొందింది. వారిరూపాలు హృదయాల్లో చిత్రించుకున్నారు. ఆ చిత్రాలసన్నిధిలో ప్రేమజ్యోతిని వెలిగించుకున్నారు. ఇలా కొంతకాలం జరిగాక సుధ అడుగుతాడు ఇందిరని పెండ్లి విషయం. ఒక్క విషయం మరచాను చెప్పటం ఇందిర, సుధలు వేరు కులాలవాళ్లు. కాని వాళ్లిద్దరికీ కులమత విచక్షణలు లేవు. అందుకే వారొకరికొకరంత సన్నిహితులు కాగలిగారు. ఇందిర అన్నతో చెబుతానీవిషయ మంటుంది. మరునాడింట్లో సుందరి దగ్గర వచ్చింది ప్రసక్తి. సుందరి అంటుంది "ఇందూ! నీవు నచ్చిన వాణ్ణి నీవు తెచ్చుకోవడం మాకిష్టమే. మాకు భారం కూడా తగ్గుతుంది. కాని కానికులం అబ్బాయిని వెదుక్కుంటావని నేను కలలోకూడా అనుకోలేదు" అంటుంది. ఆమె శర్మతో చెబుతుంది. శర్మకూడా ఆ మాటే అంటాడు. మిగతా విషయాలన్నీ వారికి నచ్చాయి కాని కులంవేరయినందుకే వారందుకు సమ్మతించలేకపోతారు. ఇందిర ముఖం ముకుళించుకొంటుంది. ఆమెలో ఉత్సాహమే చచ్చిపోతుంది. చదవడానికి మనస్సొప్పడంలేదు. ఈ విషయం సుధకి చెప్పడానికిష్టంలేక రోజూ తప్పించుకుని తిరుగుతూవుంటుంది. ఆమె రాత్రుళ్లు చదవకుండా పుస్తకం తెరిచి సుధ జ్ఞాపకంరాగా కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తూవుంటుంది. సహజంగా మెత్తని హృదయంగల సుందరి ఇది సహించలేకపోతుంది. వారి తల్లి యీమధ్యనే యేదో హృదయరోగంతో హఠాత్తుగామరణించడంవల్ల ఇప్పుడు వారికామెయనుమతి తీసుకునే పనిలేదు. శర్మ కూడా ఇందిర పరిస్థితికనిపెడ్తూనేవున్నాడు. అత్యంత ప్రేమతో చూచుకునే ప్రియాతిప్రియమైన ఒక్కగానొక్క చెల్లాయిలా బాధపడుతూంటే ఏ అన్నమాత్రం సహించి వూరుకోగలడు చెప్పండి! ఆమె జీవితాంతం తనకిష్టంలేని వాడితో ముళ్ళబాటలో విహరిస్తూంటే ఆ అన్నకళ్ళనుండి రక్తధారలు ప్రవహించక ఆనందభాష్పాలు రాలతాయా చెప్పండి! చివరికి శర్మ చెల్లాయికి చెబుతాడు సుధాకర్‌కామె నివ్వడానికి వారి కభ్యంతరంలేదని. ఇది వినగానే ఆమె యానందానికి మేరలేదు సుమా; ఆమె చిరునవ్వు ముఖంచూశాక శర్మకి కూడా హృదయంలో నిర్మలస్రవంతులు జలజలలాడాయి.

ఆ మరునాడామె సంతోషంగా కాలేజీకి వెళ్తుంది. సుధకోరకు వెదుకుతుంది. లీలనడుగుతుంది. ఈ మధ్య ఇందిర నాలుగయిదు రోజులు కాలేజికి వెళ్లకపోవడంవల్లామెకు చాలా విషయాలు తెలియలేదు. కాజీ లీలకు సామాన్యంగా అన్ని విషయాలూ చెబుతాడు. ఇందిరతో వివాహప్రస్తావన తెచ్చిన రోజునే వాళ్ల నాన్నగార్కికూడా వుత్తరం రాస్తాడు తనకిలా ఇందిరతో పరిచయం అయిందనీ ఆమెనితప్ప యింకెవ్వరినీ పెండ్లిచేసుకోవడం ఇష్టంలేదని. ఆ వుత్తరం వ్రాసిన మూడవ రోజున సుధకి టెలిగ్రామ్ వస్తుంది ఒకసారి రమ్మని. సుధకి ఇందిరని కలుసుకునే అవకాశం లేకపోతుంది. ఇందిరకైర ఒక వుత్తరంవ్రాసి లీలకిచ్చి లీలకన్ని విషయాలూ చెప్పి త్వరలోనే వస్తానని యింటికి వెడతాడు. ఇందిరకీ విషయాలన్నీ తెలియగానే మళ్ళా హృదయం బరువెక్కుతుంది. సుధ తల్లిదండ్రులు దీనికి సమ్మతిస్తారో లేదో! ఒకవేళ సమ్మతించ

రేమో! అనే పిచ్చి పిచ్చి ఊహలు ఆమెను మరింత పిచ్చిదాన్ని చేసేలా వున్నాయి.

అక్కడ సుధ యిల్లు జేరతాడు. సుధని చూడగానే తండ్రి కొంతసేపటివరకు మాట్లాడక ఆ తర్వాత నెమ్మదిగా చివాట్లు పెడతాడు. తల్లి కూడా చెబుతుంది బాబూ! ఇలాటి పనులు చేసి కుటుంబానికి మచ్చతీసుకురావద్దని. అతనిలా చేస్తే అతనికున్న మిగతాయిద్దరి చెల్లెళ్ల పెళ్ళిళ్ళు ఎలా కాను! సంఘంలో గౌరవం మంటకలిసిపోతుంది. సుధ తండ్రిగారి పేరుప్రఖ్యాతలు మట్టిపాలవుతాయి. ఈ విషయాలన్నీ రెండు రోజులు తలిదండ్రులిద్దరూ విశదంగా బోధపరుస్తారు. ఆ విషయాలన్నీ సుధకి తెలియనివి కావు. తెలిసీకూడా అలా చెయ్యడమేమిటని మీరు ప్రశ్నిస్తారేమో! దానికి జవాబు చాలా వరకు వయస్సునుబట్టి వుంటుంది. ప్రపంచంలో వున్నది ఒక్క పేరు ప్రఖ్యాతలు మాత్రమే కావు. లేక కులమతాలే మానవులకు ప్రాణాలుపోసి జీవితాలని నడపడంలేదు. ప్రతి మానవుడికి వీటన్నిటికంటే ముందు హృదయమనేది ఒక్కటుంది. హృదయానికి కావలసినవి ఇవన్నీ కావు. హృదయమున్న ప్రతిమనిషీ నీతిగా బ్రతికే ప్రతిమనిషీ కొన్ని కూడా బాగానే అర్థంచేసుకోగలుతాడు. హృదయమే హృదయాల నర్థంచేసుకోగలదు కాని పాషాణాలు కావునుమా!

సుధ జీవితానికిదొక పెద్ద సమస్య. దీనిని విడదీసుకోగలిగితే అతని జీవితం సుఖమయమవుతుంది. లేకపోతే బాధలతో కుమిలిపోయేకంటే వేరు గత్యంతరమేలేదు. సుధ తలిదండ్రులకి ఇలాటివాటిల్లో బాగా పట్టుదలవుంది. సుధకి క్షణాలు యుగాల్లాగా గడుస్తున్నాయి. క్షణక్షణానికి ఎక్కువయ్యే బాధని భరించలేకపోతున్నాడు. తన దుస్తులమీద, భోజనంమీద శ్రద్ధతీసుకోవడంలేదు. ఏదోలా ఎప్పుడూ తన గదిలోనే కూర్చుని తలపట్టుకుని ఆలోచిస్తూనే వుంటాడు. సుధ తల్లిగార్కి ఆ అవతారం చూసేసరికి కొక్కడలేని కోపమూ వస్తుంది. రెండు రోజులు కొప్పడుతుంది. సుధ చలించలేదు. సుధ తనకన్న కొడుకు - సుధ ఒక్కడే కుమారుడు. సుధ తర్వాత యిద్దరూ ఆడపిల్లలే. సుధయే వారి కుటుంబానికి దీపం. అతనే వారి కుటుంబంపేరు నిలిపే పుత్రుడు. అలాంటి సుధాకర్ భోజనం మానుకుంటే కన్న తల్లి హృదయం కొట్టుకులాడింది. ఆమె రెండు రోజు లెలాగో సహించగలిగింది. కాని నవమాసాలుమోసి కనిపెంచిన పుత్రుడు - భోజనమయినా చెయ్యకపోతే ఆమె హృదయం తరుక్కుపోదూ? వచ్చి బ్రతిమాలింది. కాని సుధ ఏమీ వినిపించుకోలేదు. మూడు నాల్గు రోజుల్లో చిక్కిశల్యమైపోయాడు. ఆ ఆకారాన్ని చూసి యీమె కంగారుపడింది. చివరికొక రోజున సుధాకర్ ఏదో నిశ్చయానికి వచ్చినట్టున్నాడు. తిన్నగా తండ్రి దగ్గరకువెళ్ళి యిలా చెబుతాడు.

“నాన్నగారూ! ఇక నేనిక్కడుండలేను. ఎక్కడికయినా వెళ్ళిపోతాను. నా హృదయాన్నర్థం చేసుకోనిదే యింట్లో వుండడంకంటే ఏమయిపోయినా మెరుగే”

“సుధా! ఏమిటి మాట్లాడుతున్నావో తెలుసా? నీవు ఏమయినా సరే, నా కుటుంబానికి మాత్రం మచ్చ తెచ్చుకోవడం నాకిష్టంలేదు. పో. నీ యిష్టం. ఎక్కడికయినా పో. నాకు వున్నది యిద్దరూ ఆడపిల్లలే ననుకుంటాను” అని వుద్రేకంగా అనేసారు. ఈ గలభాకి సుధ అమ్మగారు కూడా వస్తారక్కడికి. సుధ రూపు చూస్తూంటేనే ఆమెకు గుండె దేవినట్లవుతోంది. ఆమె యీ సంభాషణ వినగానే కన్నీరు కార్చడం మొదలు పెట్టింది. “సుధా! నా మాట వినవు నాయనా? మమ్మల్ని విడిచి ఎక్కడికి వెళ్ళిపోతావు? వెళ్లి ఆ అమ్మాయిని పెండ్లిచేసుకుని సుఖంగా వుండగలిగే ధైర్యం నీకుంటే నా కడుపులో కారుచిచ్చు వెలిగించి వెళ్ళిపో, బాబీ...” అంటూ ఏడుస్తుంది. అందుకు సుధ “అమ్మా! మీ మాటలకు వ్యతిరిక్తంగా చెయ్యగలిగేవాడినయితే వెంటనే వెళ్ళిపోయే ఆ పని

చేసేవాడిని. ఇంతవరకు నా తల్లి మాటలకు వ్యతిరేకంగా నేనేమీ చెయ్యలేదు. ఇప్పుడు చేసీ నేను సుఖించలేను. అందుకే ఎవ్వరికీ బాధ లేకుండా వుండడానికి నా త్రోవేదో నేను చూసుకుంటాను. అమ్మా!" అంటూ తల్లిని కౌగలించుకుంటాడు. తల్లి కూడా భావురుమంటుంది.

"బాబీ! నన్ను ఏటముంచి వెళ్ళిపోతావా? ఇంతవరకూ వచ్చావా సుధా! ఇంతవరకూ నా మాట కాదనలేదనే ఇప్పుడుకూడా మారతావనే నేనింత కాఠిన్యం వహించాను బాబూ! నీవు పోయాక నా జీవితం మాత్రం ఎందుకు? సుధా!" అంటూ వెక్కి వెక్కి ఏడుస్తూ ఏడుస్తున్న సుధ కన్నీరు తుడుస్తుంది.

"నా కొడుకు బ్రతికివుంటే అదే చాలు. గర్భశోకం నేను భరించలేను. కులం ఏమయిపోయినా సరే. సుధా! నీ యిష్ట ప్రకారమే కానీయి నాయనా" అని కన్నకొడుకు కన్నీరు తుడుస్తుందా మాతృమూర్తి. మాతృమూర్తి హృదయమే అది. "అమ్మ" అనే పదంలోని మాధుర్యం ముల్లోకాల్లో ఎక్కడ వెదికినా మీకు కన్పిస్తుందా చెప్పండి? కన్నతల్లికి సహజంగా వుండేది కడుపుతీపి. తల్లీ కుమారుడూ ఒకటయ్యేసరికి తండ్రి కఠినహృదయం మారక తప్పిందికాదు. ముందు కోపంగా వున్నా రాను రాను తండ్రికూడా చల్లారాడు. ఆనందంగా తిరిగి సుధ కాలేజికి వస్తాడు. ఇందిర కందజేస్తాడానందంగా సంతోషవార్త. ఇద్దరూ తేలికైన హృదయాలతో పట్టుదలతో ఆ మిగిలిన రెండు నెలలూ చదివి బి. యస్. సి. పూర్తిచేశారు. ఆ సెలవుల్లో రెండు కుటుంబాలూ సంతోషంగా హృదయపూర్వకంగా వివాహాన్ని పూర్తిచేశాయి. ఇప్పుడు ఇందిర మధురగాయకుని హృదయాధిదేవత.

పెండ్లి అయ్యాక సుధాకర్ వాళ్ళ పరీక్షాఫలితాలొచ్చాయి. సుధకి ఫస్టుక్లాసు, ఇందిరకి సెకండు క్లాసు వస్తాయి. సుధ ఇందిరకి తెలియకుండా ఫారిన్ స్కాలర్‌షిప్‌కి అప్లై చేస్తాడు. కొద్ది రోజుల్లో అతని అదృష్టంకొద్దీ స్కాలర్‌షిప్ వస్తుంది. ముందు కొడుకుని విడిచిపెట్టివుండాలే అని తల్లిదండ్రులు ఒప్పుకోరు. కాని మళ్లా కొడుకు పైకి వస్తాడే అని ఆశ యొకటి ప్రోత్సాహించడంవల్ల ఒప్పుకోక తప్పిందికాదు. ఇందిరనువిడిచి సుధ వుండలేడు కనుక ఆమెనూ తీసుకువెళ్ళాలనుకుంటాడు. కాని శర్మ కామెను విడిచివుండాలంటే గుండెల్లో రాయిపడింది. ఒకరిచేతిలో పెట్టాక తను వేరే చెప్పడానికికూడా హక్కు లేదు కదా! అందుకతనెంతో మథనపడతాడు. కాని పైకి "వెళ్ళొద్దు" అని చెప్పలేకపోతాడు. ఒకవేళ చెప్పినా సుధాకర్ ఏమనుకుంటాడు? పెండ్లయిన తర్వాతకూడా అతనిమాట వినకపోతే ఇందిరని మాత్రం ప్రపంచం ఏమంటుంది? ఇటు అన్నని విడిచివుండలేదు. అటు సుధని విడిచివుండలేదు. "ఏవిధంగానైనా ఆడపిల్ల పరాయివాళ్ళపిల్లేకదా. అంత మీరు బెంగపెట్టుకుని ఇందిర సంసారాన్నేమి చెయ్యదలచుకున్నారని" సుందరెన్ని విధాలో శర్మకి నచ్చచెబుతుంది. శర్మ ఎంతో విచారిస్తాడు. చివరికి ఆ వేదనను భరించలేక ఒక రోజు సుందరి దగ్గర చిన్నపిల్లాడిలా ఏడ్చేస్తాడుకూడాను. కాని సుందరి అతన్నెంతో ఓదారుస్తుంది. సుందరిలాంటి భార్య దొరకబట్టే శర్మజీవిత మింతవరకు ఒడిదుడుకులు లేకుండా గడచిపోయింది. భగవధేచ్ఛయంతా చివరికి ఇందిరకు సుధతో వెళ్ళక తప్పిందికాదు. ఆమె యీ ప్రదేశం విడిచే రోజున చిన్నపిల్లల్లా అన్నాచెల్లెళ్ళిద్దరూ ఒకరినొకరు కౌగలించుకుని యేడ్చేస్తారు. అదే పవిత్రసోదర ప్రేమ, ఇందిర వెళ్ళాక మొదట కొన్ని రోజులు మరీ పిచ్చెత్తినట్లుండేది శర్మకి. కాని సుందరి శర్మయందెంతో శ్రద్ధ తీసుకుని ఒక్క నిముషమైనా అతన్ని ఒదిలివుంటే యేమేమి ఆలోచించి మనసు పాడుచేసుకుంటాడోనని అతన్ని కంటికి రెప్పగా కాపాడేది. ఇలా రోజులు గడు

స్తున్నాయి. భగవంతుడు ఈ దంపతులమీద చల్లని చూపు చూసినట్లున్నాడు. సుందరి గర్భం ధరించింది. శర్మ ఈ వార్త విన్నాక, సంతోషంగా వుంటకట్టుతున్నాడు సుందరి పొట్టలో పాపాయిని తలచుకుంటూ. ఎలాగయితేనేం తొమ్మిది నెలలూ దాటి పదవనెల జొరబడుతుంది. నెలలు పూర్తి అయ్యేసరికి సుందరికి పురుడువస్తుంది. కాని శర్మ అదృష్టరేఖ తిరిగిపోతుంది. పురుడు కష్టంకాగా శర్మని విచారంలో ముంచి సుందరి చనిపోయిన శిశువుని ప్రపంచానికి విడిచిపెట్టి ఆమెకింక యీ లోకంతో సంబంధంలేనట్లు పరలోకానికి పయనమవుతుంది. దానితో శర్మ పూర్తిగా కృంగిపోతాడు. జీవితంమీద విరక్తిపుడుతుంది. తనతో సమంగా రక్తం పంచుకుపుట్టిన ఇందిర ఆ విధంగా దూరమయింది తనకి. తన ప్రాణానికంటే మిన్నగా కాపాడిన అర్ధాంగి తనని అన్యాయంచేసి తన త్రోవ తను చూసుకుంది. ఏమిటీ అన్యాయం? ఒక్కొక్క జీవి ఈ విధంగా అంతులేని బాధలతో కుమిలి కృశించిపోవాలి కాబోలు! ఇవే భగవంతుని లీలలు. ఎప్పటికేమవుతుందో యెవరికీ అర్థంకాదు. ఇప్పుడు శర్మకీ యీ ప్రపంచానికీ యేమీ సంబంధంలేదు. కాషాయవస్త్రాలు ధరించి ఎప్పుడూ భగవంతుని నామమే స్మరించుకుంటూ పుణ్యక్షేత్రాలు తిరుగుతూంటాడు. భగవంతుడు తనకిన్ని కష్టాలు తెచ్చిపెట్టినా మళ్ళా ఆ భగవంతుడంటేనే అంత భక్తి ఎందుకో! అదీ మాయగానే వుంటుంది తలచుకొంటూంటే. అతని యీ ప్రయాణానికి గమ్యం ఏది? ఎంతదూరమని యిలా ప్రయాణం సాగిస్తాడు? ఈ ప్రపంచానికి ఒక అంతూ, దరీ అనేవి వుంటేగా! అంతా అయోమయము యిది!!

—o—

# శ్రీ రామ కర్ణామృతము

(ఆంధ్రానువాదము)

ద్వితీయాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు



(గత సంచిక తరువాయి)

౭౮

వేదనియమముల, వెదకిన దొఱకెను
హృదయంబునందు, వసింతువీవు!
వేదశాస్త్రములచే వెదకిన దొఱకవు
హంస మాత్రపు ధ్యానల రెదీవు!
బ్రహ్మ విష్ణు, శివులువంద్యులై యున్నారు
దశరథ పుత్రుండై దనరెవు
వక్షఃస్థలమునందు భాగ్యలక్ష్మి వసింప
ముద్దుముచ్చటతోడ మురిసెదీవు!
దేవతలకేల దేవుండైనావు నీవు!
ధరణి 'తత్'' మంత్రసారమై బరగెదీవు!
జానకీనాథ! శ్రీరామ చంద్ర! వరద!
స్తోత్రమొనరింతు రక్షింపు శుభవిలాస!

౭౯

పూర్ణచంద్రునివంటి ముద్దుమోముగలాఁడు
సీతాసమేతుండై చెలఁగువాఁడు
శరచాపహస్తుండై, సౌందర్యమూర్తియై
శరణన్నఁ బ్రోచెడు కరుణగలడు
నవమేఘములబోలు నవ్యదేహమువాఁడు
కలువరేకుల వంటి కనులవాఁడు
లలిత శుభగుణుండు లక్ష్మణునయంబుఁ
దనకడఁ జేకొని తనరు వాఁడు
ఇంద్ర నీలరుచి, జయించిన తనుకాంతి
తోడ, సొబగులీనువాఁడు; రామ
చంద్రమూర్తి నన్ను సతతంబు రక్షింపఁ
బ్రార్థనంబొనర్తు భక్తితోడ.

౮౦

''ఓంకార''మే నీకునొప్పి బీజాక్షర
మై, రామచంద్ర! సత్యగుణసాంద్ర!
''ఓం! భూర్భువస్సువః ఓంతత్స'' నెడు శబ్ద
ముల చేత నిండిన మోహనాంగ!
ఓంత్రయముచేత రాఘవా! నీవెప్పు
నారాధనము బొంది యలరినావు!
ఓంకార ప్రకృతివై, ఓంకార కందాంత
రంబవై యున్నావు రామచంద్ర!
'ఓం' షడక్షర మంత్రంబు భూషణంబు
నీకు; సర్వోపగతుండవై నెగడు కమల
నాథ! ''ఓంకార'' సింహాసనంబుస్థాన
మాయె నీకు శ్రీరామ! జోహారుఁ
గొనుము.

౮౧

సాకేతపురములో - శ్రీకల్పవృక్ష వా
టికయందు మేడలో శివిమెఱయు,

'అ! మొదల్ 'క్షాం'త వర్ణాబ్జ మధ్యము
నందు
సింహాసనమువీద చెలువుగాగ
ఓంకార పద్మంబునొప్పి యుండగ, నందు
శ్రీరామచంద్ర! యాసీనుఁడగుచు
వ్యాసాంబరీషాదులాదిమునీశ్వరు
లఖిలదేవతలు నీయండఁజేరి

స్తోత్రమొనరింప, వారి సంస్తుతుల మెచ్చి
యచ్చు వరములనొసఁగెడి సచ్చరిత్ర!
రామ! తారకనామ! శ్రీరామచంద్ర!
భజనసల్పెదఁ బ్రోవుమా భయములుడిపి

గీ౨

జానకీ కుచచర్చ చందన కుంకుమ
చిహ్నముల్ గల్గిన శ్రీ శుభాంగ!
కోదండ విద్యలో గురుపీఠము వహించి
యాదిమూలంబైన యబ్జనేత్ర!
సద్గుణంబులకెల్ల స్థావరంబైట్టి
శ్రీపరాత్పరుఁడైన చిత్ప్రకాశ!
అఖిల జనంబుల యంతరంగమునందు
వెలుగుచు నున్నట్టి వేదవేద్య!

అనుఁగుఁదమ్ముఁడు లక్ష్మణుండనవరతము
నిన్ను వెంటాడి సేవింప సన్నుతాంగ!
ముదముతోడనున్నాడవు ముద్దుమూర్తి
శరణు వేడెద శ్రీరామ! సత్యపాల!

గీ౩

శ్రీధామమైన, మూలాధార చక్రంబు
నందు, హుతవహుఁడధివసించు;
నందుండెడి, త్రికోణయంత్రంబున
న్కుండ
లీరూపముగ, జానకీరమణుఁడు
హాయిగాఁదాసుషుప్త్యావస్థనొందుచు
పాశాంకుశములతోఁబరగుచుండు;
భూతంబులకునెల్ల ముఖ్యాశ్రయంబౌచు
నాదిమపురుషుఁడై యలరుచుండు
నభయహస్తముల్ గల్గి, బాలార్కతేజుఁ
డై, భవరహితుఁడై, పుణ్యుఁడై, వెలుంగు
చుండు, వాసాంత వర్ణాశ్రయుండు, రామ
చంద్రుఁడాతని సేవింతు సంతతంబు.

గీ౪

ధీవృద్ధిఁజేయు స్వాధిష్ఠాన చక్రంబు
నందు, బాలాంత వర్ణాశ్రయంబ
వగుచుఁజెల్వారు బ్రహ్మగ్రంథిచే,నున్న
తంబయినట్టి, హస్తంబునందు
కుండిక మాలికల్ గొమరొప్పగాఁదాల్చి
రత్నపీఠంబున రమణనెగడి
సాధువాక్యములతో, సాత్త్వికతత్త్వబో
ధనలతో, భక్తులఁదన్విఁగొల్చి

అభయమొసఁగి దివ్యశుభములఁజేకూర్చు
రామభద్ర! వరద! ప్రణుతిఁజేతు
ధరణిభక్తతతికిఁదారకరాముండ
వీవు! శరణుగొంటిఁబ్రోవుమయ్య!

(సశేషము)

# బిడ్డలు - తల్లిదండ్రులు

## నిర్మాణాత్మక క్రమ శిక్షణ

శ్రీ కె. వెంకట్రామయ్య



(గత సంచిక తరువాయి)

### బిడ్డల తప్పొప్పులను తెలిసికొనెడి విధానము :

తప్పొప్పులనుగూర్చి సరియగు నభిప్రాయములను గలిగియుండుట పెద్దలకే సాధ్యము కాకుండును. అట్టియెడ బిడ్డలకది సహజముగనే సాధ్యమగుననుకొనుట కేవలము భ్రమయేయగును. ఏ యిద్దరు పెద్దలును నీతి మర్యాదల విషయములలో పూర్తిగా నేకీభవింపజాలగలరో? వారికిగల యభిప్రాయములును ఎల్లకాలము నొకే రీతిగ నుండవు. అవి మారుచుండును. జాతిమత సాంప్రదాయములును, నీతి ధర్మములును కాలానుగుణముగ మారుచునే యుండును. లోకమున కంతకును ఒకే విధమగు నీతి సూత్రముల నెన్నటికిని ఏర్పరుపజాలము. నీతి మర్యాదలగూర్చియు తప్పొప్పులగూర్చియు జనుల యభిప్రాయములు వేరై వివిధరీతుల నున్నను అన్నియు సమాన గౌరవార్హములే కావచ్చును. మనః పూర్వకముగ నమ్మిన యుద్దేశములే కావచ్చును.

### నీతినిగూర్చి బిడ్డలకుండెడి భావములు :

నీతినిగూర్చి పెద్దలకుండెడి భావములే, నానావిధములై, ఏకరీతిగ నుండవు. అట్టియెడ బిడ్డకా నీతినిగూర్చి తెలియుననుకొనుటయెట్లు? కనుక బాగుగా నాలోచింపక, బిడ్డచేసెడి తప్పులు బుద్ధిపూర్వకములని చెప్పరాదు. ఒక పరిస్థితిలో నొక విధముగ చరించుట తప్పని మన యభిప్రాయము కావచ్చును. అట్టి యభిప్రాయమే బిడ్డదిగూడనైనదియు కానిదియు మొదట తెలిసికొనక అతడు బుద్ధిపూర్వకముగ తప్పొనరించెనని అనుకొనుట ఎట్లు? నీతినిగూర్చి మన కేర్పడిన భావములు ఎన్నోయేండ్ల అనుభవ ఫలితములు. తప్పొప్పులగూర్చిన యనుభవములు బిడకు చాల తక్కువ. మన దృష్టికంతో తప్పుగ తోచెడి విషయము బిడ్డదృష్టికంతో సరియైనదిగాను, సహజమైనదిగాను తోచవచ్చును. కొన్ని ఉదాహరణలచే నిది విశదముకాగలదు. రంగురంగు మెరపు వస్తువులు ఒక చిన్న బిడ్డకంతో ఆకర్షణీయములగును. అందుచే నతడు వాని నింటికి గొనిపోవచ్చును. ఇతరుల సొత్తును తీసికొనరాదని మనకు తెలియును. చిన్న బిడ్డకు "సొత్తు"ననేమోగూడ తెలియదు. అట్టియెడ అతనిని దండించినచో అతడు తానెందులకు దండింపబడునదియు తెలియక దిగ్భ్రమ జెందును. ఆ మెరపువస్తు వతని కాకర్షణీయమైనది. అతనికి కావలెను. కనుక దాని నతడు తీసికొనెను. ఆ తీసికొనుట తప్పో, ఒప్పో, అతనికేమి తెలియును? అతని స్వంతమునకని వస్తువులనిచ్చి వాని నతని నడుగక మనముగాని, ఇతరులుగాని, ముట్టకుండునట్లు చూచుకొనుచు, తన్మూలమున తన సొత్తననేమో, ఇతరుల సొత్తననేమో, ఇతరుల హక్కులననేమో అతనికి తెలియజేయవలెను.

పిల్లలను లేనిదున్నట్లు భావించుకొనుటకై ప్రోత్సహింతుము. టేబిలును తలక్రిందులుజేసి అదే పడవయని అనుకొనుమందుము. కాళ్లమధ్య కర్రనుంచుకొని, చల్, చల్ అనుచు గుర్రము నెక్కినట్లు ఊహించుకొనుమందుము. కాని యతడు తన భావనా కల్పనలచే చోద్యమగుకథ నల్లి చెప్పినచో అబద్ధములాడుచుంటివని యదలింతుము.

అంత ఖరీదు చేయని కప్పు నతడు పగులగొట్టినపుడు పరవాలేదని యూరకుందుము. అదే విలువగల దైనచో వీపు బ్రద్దలు కొట్టుదుము. బిడ్డకు విలువ గల కప్పును, విలువలేనిదియు ఒకటిగనే తోచును. నిజమునకు విలువలేనిదే అతనికి ఎక్కువ ఆకర్షణీయముగ నుండవచ్చును! కప్పు విలువ బిడ్డకు తెలియదు. కనుక ఒక దానిని పగులగొట్టిన మనమేల యూరకుంటిమో మరియొక దానిని పగులగొట్టినపుడేల దండించితిమో అతనికి బోధపడక అయోమయముగ నుండును. ఖరీదులబట్టి వస్తువిలువల నిర్ణయింతురని అతనికేమి తెలియును?

పిల్లలను, పెద్దలను, అనవసరముగా బాధించెడి అనుదిన సంఘటన లిట్టివింకను ఎన్నో తటస్థపడు చుండుట సామాన్యమే. తన చిన్న కుమార్తెతో తండ్రి యామె తప్పునుగూర్చి దీర్ఘోపన్యాసము నీయ సాగెను. ఆ యుపన్యాసము ముగిసినంతనే బిడ్డ, "నాన్నా, నీవు మాట్లాడినంతసేపును నీ నోరు పైకిని, క్రిందకును పోవుచు, నీ ముఖమెంతో విచిత్రముగా నున్నది" అని యనెను. బిడ్డలతో నెక్కువగా మాట్లాడునపుడు, మన ముఖచలనములనే వారెంతో వింతగా గమనింతురు. మన మాటలను వినరు. మాటల ప్రవాహములో అసలు ఉద్దేశమేదైనదియు వారికి అందక విసుగుజెందుదురు. లేదా చిరాకు పడుదురు. అట్టియెడ వారికి తమ తప్పునుగూర్చిన పశ్చాత్తాపమెట్లు కలుగును? బిడ్డల తప్పులను వారికి తెలియజేయవలెనని ఉద్దేశముతో నుపన్యసించుట పనికిరాదు. నెమ్మదిగా "నీ తప్పిది నాయనా" యని మూడు ముక్కలతో సూటిగా జెప్పవలెను.

ఒక్కొక్కప్పుడు బిడ్డ ఎంతో మంచి యుద్దేశముతో నొక పనిని చేయబోవుటయు విపరీతఫలితములకది కారణమగుటయు తటస్థించును. అట్టి పరిస్థితిలో పెద్దలలుకజెందక ఆత్మనిగ్రహమును జూపవలెను. బిడ్డను సరిగా నర్థముజేసికొనవలెను.

తల్లి తలనొప్పి బాధతో పరుండుటజూచి ఆమె బిడ్డ, ఆ ఇండ్లేది, విచారపడి తన సానుభూతిని తల్లికి వెల్లడించి సంతోషపెట్టవలెననెడి యుద్దేశముతో అతిధుల నాహ్వానించెడి గది యలంకరణను తానే చేయసాగెను. ఆ యలంకరణ సందర్భమున ఒక పూల పాత్రను తీయబోగా అందలి నీరు కొంచెము నేలపై బడి చిందెను. నీరు చిందినంత మాత్రమున ప్రమాదమేమియు వాటిల్లలేదుగదా? ఐనను తల్లికెంతో కోపమువచ్చెను. రెండు దినముల తరువాత ఆ గదిలోనే ఆమె తన స్నేహితుల కొక "పార్టీ" నీయదలచెను. పూలపాత్రలు ఏమి బ్రద్దలగునో, తన "ప్లాను" ఏమి పాడగునో అనెడి యాందోళనలో బిడ్డ సదుద్దేశము నామె గుర్తింపదయ్యెను. తల్లి కోపమునకు బిడ్డ మనస్సు క్రుంగిపోయెను. తల్లిని సంతోషపెట్టుటకును, తన సానుభూతి నామెకు తెలియపరచుటకును తాను జేసిన ప్రయత్న ఫలిత పర్యవసానమవమానము నొందుటయా? బిడ్డ చిన్నబుచ్చుకొనుటను జూచి, "ఏమిట్లుంటివి?" అని యడుగగా, "నేనిక అమ్మను సంతోషపెట్టుటకెన్నడు ప్రయత్నింపను, అంతే!" అని బాధతో పలికెను. బిడ్డ బాధ నివారణకై నేనిట్లుంటిని. "చూచితివా, అమ్మ నుస్తీగా నున్నది ఏదో విచారముగా నున్నది. యోచన చేయక కోపించేనేగాని సరిగా నున్నచో కోపము నొందునా? ఐనను ఒకమాట. అమ్మ కాపూలెవరునుకోయుట ఇష్టములేదని నీకు తెలియునుగదా! ఆమె వానిని తన "పార్టీ"కై కోయక ఉంచినది. నీవా పూలపాత్రల నలంకరించుటకుముందు ఆమె నడిగినచో ఎంత బాగుండెడిది?" నా మాటలవలన బిడ్డ మనస్సు కొంతవరకు కుదుటబడెను. తల్లి యాలోచన వేగిరగుటచేతనే తనపై నామె యలుకజెందెనని ఆ చిన్ని బుర్రకు తోచెను. యోచింపక అలుకజెందుటచే ఆ చిన్నిమనస్సెంత నొచ్చుకొన్నదియు తల్లికి జెప్పి ఆ సంగతినిగూర్చి బిడ్డతో కొంచెము మాట్లాడుమని సలహానిచ్చితిని "నీ యుద్దేశమును తెలిసికొనక అలుకజెందితి"నని తల్లి విచారింపగా "నిన్నడుగక పువ్వులు కోసితిని. నాదే తప్పు"ని బిడ్డ పలికెను. ఇట్లు వారిరువురు ఒండొరుల నర్థముజేసికొని ఆ జరిగిన విషయమువలన మరింత సన్నిహితులైరి. ఒకరియెడ నొకరికి గౌరవభావము హెచ్చెను.

(సశేషము)

# మీకు తెలియునా?



క్షయవ్యాధి ౨౫౦౦ ఏళ్ల క్రిందటనే ఉన్నట్లు దాఖలాలు ఉన్నాయి. కాని ట్యూబర్క్యులర్ బాసిలస్ అనే క్షయవ్యాధి కారక క్రిమి ౧౯వ శతాబ్ది చివరిలో కనిపెట్టబడింది.

బి. సి. జి. వాక్సిను ప్రథమ పర్యాయంగా ౧౯౨౧లో ఫ్రాన్సులో ఒక క్షయవ్యాధి గ్రస్తురాలి శిశువుపై ప్రయోగించబడింది. శిశువులకు క్షయవ్యాధినుండి రక్షణ కల్పించడానికి బి. సి. జి. వాక్సిను ఉపయోగించే ఆచారం ౧౯౩౯ నాటికి యూరప్, ఇండోచైనా, చైనా దేశాలలో వ్యాపించింది.

ప్రపంచమంతటా బి. సి. జి. టీకాలు వేయించుకున్న వారి సంఖ్య మొత్తం ౧౮౦, ౦౦౦, ౦౦౦కు పైగా ఉంది.

గడచిన ౨౦ ఏళ్లుగా తాము గడించిన అనుభవాన్ని బట్టి బి. సి. జి. వాక్సీను నిరుపద్రవమైనదే కాక చాలా ఉపయోగకారి అని క్షయవ్యాధి నిపుణులు ఉద్ఘాటిస్తున్నారు. క్షయవ్యాధి ఎక్కువగా వ్యాపించి, దానివల్ల జనం అధికంగా మరణిస్తున్న దేశాలలో బి. సి. జి. వాక్సినును పెద్ద ఎత్తున ఉపయోగించాలని, ప్రపంచ ఆరోగ్య సంస్థ తాలూకు నిపుణుల సంఘం గట్టిగా సిఫార్సు చేసింది

ఇండియాలో నిముషానికు ఒక మనిషి చొప్పున క్షయవల్ల మరణిస్తున్నారు, ప్రతి ౧౫౦ మందిలో ఒకరికి క్షయవ్యాధి సోకుతోంది. ఏటా దీనివల్ల ౨౦౦ కోట్ల రూపాయల నష్టం సంభవిస్తున్నదనీ, ౯౦ లేక ౧౦౦ కోట్ల మనుష్యులు ౨౫ రోజుల్లో ఎంతపని చేస్తారో అంతపని దీనివల్ల నష్టమౌతున్నదనీ, అంచనా వేయబడింది.

ఇండియా ప్రభుత్వం బి. సి. జి. టీకాల కార్యక్రమాన్ని ౧౯౪౮లో చిన్న ఎత్తున ప్రారంభించారు. ౧౯౫౧లో కార్యక్రమం జాతీయస్థాయికి విస్తరించబడింది.

ఇండియాలో ఈనాడు ౧౫౪ బి. సి. జీ. బృందాలు పనిచేస్తున్నాయి. ౧౯౫౭ సెప్టెంబరు 30వ తేదీవరకు సుమారు ౯ కోట్ల ౬౪ లక్షల ప్రజలకు బి. సి. జీ. టీకాలు వేయడమైంది. ప్రపంచంలో ఇంత పెద్ద ఎత్తున ఈ కార్యక్రమాన్ని సాగిస్తున్న దేశం మరొకటి లేదు.

# అంకెలూ - సంఖ్యలూ

శ్రీ క్రొవ్విడి అన్నంరాజుశర్మ

(గతసంచిక తరువాయి)

"ఓహో. అట్లాంటివాళ్ళా? అర్థమయిందిలే?"

"కాదు. అదికాదు. నేను సహించలేను."

"పలుకవోయి శ్రీరంగనీతులు. అయినా అసలు విషయం నీకు తెలియదుగా."

"ఏమిటది?"

"మాకేం తెలుసు? ఆ నరసింహంగారిని అడుగు చెబుతాడు. అయినా మీ అమ్మాయి విషయం మా కెందుకు?"

"ఏమిటిప్రేలావు?"

"తన కూతుర్ని గురించి యీ మాట విన్నప్పుడు ఏ తండ్రి యీ మాటను అనలేడు? అయినా మా కెందుకు? మాలో మేము చెప్పుకుంటాం - నీకు చెప్పం"

"నా పేరు రాజశేఖరం. గుర్తించి మాట్లాడు?"

"ఓహో! ... రాజశేఖరయ్యగారూ. జరిగి పోయిందేదో జరిగిపోయిందిగాని, యీ తెచ్చుకున్న కూతుర్ని గురించయినా కాస్త తొందరపడండి. లేని యెడల తమ పేరు ప్రఖ్యాతులు, మట్టిలో కలిసి పోగలవు?"

జనం నవ్వారు.

దుఃఖ సమయంలోకూడా, మనిషి కోపంతో, అవమానంతో వణికిపోతున్నప్పుడుకూడా మనసు విలాసంగా నవ్వేనవ్వు ఒకటివుంది. అదే యిది.

పదేళ్లక్రితం దుర్మార్గుడు, తరువాత సన్మార్గుడు, యిప్పుడు అయోమయావస్థలోవున్న మానవుడు రాజయ్యగారు ఒక దృఢ నిశ్చయంతో బయటకు వచ్చాడు గదిలోంచి. ఇల్లంతా కాంతివంతంగా విద్యుద్దీపాలు వెలిగిపోతున్నాయి. ప్రక్కనే కొద్ది దూరంలో మేడమెట్లు. రాజయ్యగారి క్రౌర్యం అయోమయంగా ఆ మేడమెట్లుఎక్కి పైకిపోయింది. అది కమలగది. గోడచాటునుంచి పొంచిచూస్తూన్న కమల ధైర్యంచేసి, తన పాలిపోయివున్న వదనంతో యివతలకువచ్చి పైనుంచే "నాన్నా! ఏమిటి?" అంది హీనస్వరంతో.

మెట్ల దిగువ నిలబడి పైకి చూస్తున్న రాజయ్యగారు, వెనువెంటనే చూపు మరలించుకొన్నపుడు దృశ్యపథంలో తెరిచివున్న అన్ని కిటికీలూ, అవతలి చీకటిని సువ్యక్తంచేస్తూ నల్లగా నవ్వాయి. అసహ్యంతో తలవిదిలించుకుని, ఆ ప్రశ్నకు జవాబు చెప్పకుండా వెలుపలికి వచ్చాడు. డ్రైవరు అప్పుడే కారు గెరాజీలో పెట్టబోతున్నాడు. అందులోకి ఎక్కి కూర్చుని "శివాలయంవీధికేసి పోనియ్యి" అన్నాడు.

జనసమ్మర్ధంగావున్న వీధుల్లోంచి కారుపోతూంటే రాజయ్యగారు వంటరిగా ఆలోచిస్తున్నాడు. అది దేనిగానో పరిణమిస్తోంది.

"నాకు నిజంకావాలి, నిజంకావాలి."

"వద్దు. అది అత్యంత ప్రమాదము."

"నేను భరిస్తాను" అన్నాడు రాజయ్యగారు ఎలుగెత్తి జీర్ణకంఠంతో.

"వాట్ సార్" అని డ్రైవరు తృళ్ళిపడి వెనక్కి

తిరిగి ఆ రూపం చూపి మరింత బెదిరి మాట్లాడకుండా వేగం హెచ్చించాడు.

"కొంతసేపటి క్రితంవరకూ ఉపన్యాసాలతో ఎంత ప్రశాంతంగా గడిచింది కాలం? ఇప్పుడు ఎంత స్వల్పవ్యవధిలో యిన్ని మార్పులు తటస్థించాయి?" అని రాజయ్యగారు కళ్లుమూసుకున్నప్పుడు మనస్సులో మెదిలింది.

"అందుకనే నిజం భరించడమంటే వేదికమీద ఉపన్యాసాలివ్వడమంత సులభం కాదు."

"అది అబద్ధమని రుజువుచేస్తాను." రాజయ్యగారు కళ్లుతెరిచినప్పుడు కొన్ని నీళ్ళు ధారగా ప్రవహించాయి.

వీధి మొదట్లో కారు ఆగింది. ఆయన మెల్లగా దిగి వందగజాలు నడిచాక ఓ పసుపురంగు మేడని సమీపించాడు. మనుషుల రంగులూ, మేడలరంగులూ చీకటి వెల్తురులలో మారుతాయి. అది అసలు పసుపు కానేకాదు. రాత్రి వయస్సు ముదరకపోయినా జనసంచారం ఏమీ లేదు ఆ సందులో. మేడముందు ఓ స్ట్రీట్ లైట్ ఉజ్వలంగా వెలుగుతోంది. సర్వత్రా నిశ్శబ్దం. మెల్లగా మెట్లు నెక్కి తలుపుతట్టి "నరసింహం!" అని పిలిచాడు బిగ్గరగా.

భవంతి ఊగిసలాడి నట్లయింది.

"నరసింహం తలుపుతియ్యి?"

లోపల లైటు కిటికీగుండా వెలిగింది. భీతావహంగా తలుపులు తెరుచుకున్నాయి. ప్రకాశవంతమైన గదిలో గుమ్మం అవతల ఒక చేత్తో చొక్కా సరిచేసుకుంటూన్న నలభై ఏళ్ల వ్యక్తి లోలోపల అదిరి పడ్డాడు. ఇది క్షుణ్ణంగా బహిర్గతమాతూన్న విపరీతమైన వాలకం.

"మీరా?"

యవ్వన పురుష బలంతో అతన్ని నెట్టుకుని, లోపలకుపోయి "తలుపులు వెయ్యి" అన్నాడు కటువుగా

"ఎందుకూ కోపం ఏం కావాలి?" అన్నాడు నరసింహం వాలిపోయిన ముఖంతో.

"ముందు వెయ్యి."

ఈ ఆజ్ఞ అనుల్లంఘనీయమని గ్రహించి శిరసావహించాడు. గోడ నానుకుని తలవంచుకు నిలబడ్డాడు.

"నరసింహం ... నువ్వు."

"ఆగండి. నన్ను మీరు అని సంబోధించేవారన్న సంగతి మరిచిపోయినట్లున్నారు" అని నరసింహం తలఎత్తి ధైర్యంగా అన్నాడు.

ఈ మాటలు వినిపించుకునే స్థితిలో లేని రాజయ్యగారు మరింత క్రోధంతో "చెప్పు. పదేళ్ళక్రితం ఏం చేశావు నువ్వు? నిజమేనా?" అని అడిగాడు కళ్ళలోకి అమితతీక్షణంగా చూస్తూ.

నరసింహం ఏమీ జవాబు చెప్పలేదు. ఆశ్చర్యంతో చూడసాగాడు.

రాజయ్యగారు ముందుకువచ్చి అతని భుజాలు పట్టుకుని గట్టిగా కుదిపాడు. "నన్ను విస్మరించకు. ఏంచేశావు నువ్వు?"

నరసింహం యీ చర్యకు అసహనంతో నిర్విణ్ణుడయి, గోడను అనుకుని నిబ్బరంతో "ఇది బాగుంది. పదేళ్ళక్రితం నేనెన్నో పన్లుచేశాను. ఏదిచెప్పేది?" అన్నాడు.

"నువ్వు తప్పించుకోలేవు నరసింహం. నా ముందు అబద్ధం వచించీ జీవించలేవు. సింహం ముసలిదైనా దానిపౌరుషం చావదు. నిజంవొప్పుకుని నిన్ను నువ్వు కాపాడుకో. ఇప్పుడుచెప్పు — నువ్వు నాకేం ద్రోహం చేయలేదూ?"

ఈ గంభీరాకారం దాల్చినను విధివంక ఒక్కసారి చూశాక ఆ స్థితిలో అటువంటి మాటలు వినటం తటస్థించాక నరసింహం కాదుగదా మరి ఎవరైనాసరే నిలువునా నీరయిపోవలిసిందే. మాట్లాడేది రాజయ్యగారు కాదు. రాజశేఖరం. నరసింహం విగ్రహం సడలిపోయింది. అచేతనుడై నిలబడిచూస్తూ వూరుకున్నాడు.

(సశేషము)

# ముద్రణాకళ

శ్రీ గిడుగు వెంకట రామమూర్తి

వివిధ కళలను భద్రపరచే కళ ముద్రణ కళ. అంతే కాదు వివిధ పరిశ్రమల పురోభివృద్ధికి సహాయపడే కళ గనుకనే ముద్రణనుకూడా ఒక పరిశ్రమలన్నారు అధునిక ప్రపంచంలో అనేక శాస్త్రాలు, త్వరిత గతిని వృద్ధిపొందింది, మానవాతీత మయినవనుకున్న శక్తులను కూడా అవి సాధించ గలిగినాయంటే, ఆవకాశం వాటికి ముద్రణవలన కలిగినదనే చెప్పాలి. ముద్రణ అంటూ లేకపోతే మానవునిలో యింత నాగరికత కలిగి ఉండేది కాదు. ముద్రణతో సంబంధం లేని వారు యీ కాలంలో ఎవరూ ఉండరనే చెప్పవచ్చు. కాని ముద్రణ ఏ విధంగా జరుగుతుందో చాలా మందికి తెలియదు. పల్లెలలో పత్రికలు చదివేవారికి ఆ పత్రికలు ఎంత కాలంలో, ఎంతమంది పనిజేయగా తనకు ఆ పత్రికలు ద్వారా అందినవార్తలను జేర్చగలిగినవో ఊహించలేరు. ఎన్ని వేలమంది ఆ పత్రికల ప్రతులను తమవలెనే ఆ సమయానికే చదవ గలుగుతున్నారో ఊహించుకోగలిగితే వారికి ఆశ్చర్యం వేయక తప్పదు. సాధారణులకు ముద్రణను పరిచయం చేయుడమే యీవ్యాసంయొక్క ఉద్దేశ్యం.

## ముద్రణ పుట్టుక :

ముద్రణ తొలిసారి ఏరూపంలో ఎలా పుట్టిందో చెప్పడం కష్టం. కర్ర దిమ్మల మీద చెక్కి వాటితో ముద్రించడం క్రీ. శ. 400 నాటికే చైనాలో ఉండేదని కొందరంటారు. క్రీ శ. 770 నాటికి జపానులో ప్రారంభమయిందని మరి కొందరంటారు.

విడివిడి అక్షరాలతో ముద్రించే పద్ధతిని జర్మని దేశస్థుడైన జాన్ గుటెన్‌బర్గ్ కనిపెట్టేనని కొందరుకాదు, నెథర్‌లాండ్స్ వాస్తవ్యుడైన లారెన్స్ కోస్టర్ కనిపెట్టేడని మరికొందరు అంటారు. కాని అమాంతంగా యీ యిద్దరిలో ఏ ఒకరో యీ విధానాన్ని కనిపెట్టేరనడానికి వీలు లేదు. వీరికి పూర్వంనుండి ముద్రణ విధానంలో పరిశోధనలు జరుగుతూ ఉండి వీరికాలంనాటికి ఒకరూపానికి వచ్చిందని చెప్పవచ్చును. ఆధునిక ముద్రణ విధానం యింత ఉచ్ఛస్థితికి వచ్చిందంటే యిట్టి మహనీయుల కృషిఫలితమని మనం చెప్పవచ్చు. అయినా కొన్ని శతాబ్దాలు ముద్రణ చాలామోటుగా ఉండేది. అది కళగా కాకుండా చిన్న పరిశ్రమగానే

రూపొందింది. ఆదిలో ముద్రాపకుల శ్రమంతా పదాలను, వాక్యాలను కాగితాలమీదకు ఫిరాయించడానికే వినియోగించేవారు. అప్పటివారు కళాదృష్టితో ముద్రణను చూడలేదు. మానసిక, శారీరక శ్రమను తగ్గించుకోవాలన్న దృష్టితోనే వారు పనిచేశారు. కాక్స్టన్ అనే యింగ్లీషు రచయిత ముద్రణ విధానాన్ని అవసరార్థంనేర్చుకున్నాడు. అతడు రచించిన 'డిట్రాయిస్!' చరిత్ర యొక్క మూడవ భాగంలో యీ విధంగా తెలియజేశాడు. ''దీన్ని రచించడానికి నా కలం అరిగిపోయింది. నా చేయి నిలకడగా ఉండడం లేదు అలసిపోయింది. నా కళ్లుమసగలు గమ్ముతున్నాయి. నా శరీరం యిదివరకులాగ కష్టపడడానికి యిష్టపడక నిరాకరిస్తున్నాది. అందుకనే ఆముద్రణ విధానాన్ని నేర్చుకున్నాను. ప్రతివారికి నాగ్రంథం యొక్క ప్రతి చివరకు లభించడానికి వీలవుతుంది''

ఆ నాటి ముద్రణను, అక్షర స్వరూపాన్ని నేటి ముద్రాపకులు చూస్తే అవి చాలా అనాగరీకంగా కనబడక తప్పదు. కానీ ఆ నాటి పరిస్థితుల్లో, అప్పుడు లభ్యమయ్యేవస్తు సామగ్రిని బట్టి అప్పటివారికి ముద్రణతృప్తికరంగా ఉండేదనే మనం ఊహించవచ్చును. 19వ శతాబ్ది మధ్యకాలం వరకు ఉండిన ముద్రణ విధానం అధునిక ముద్రాణ విధానంతో పోల్చిచూస్తే చాలా అసహ్యంగాను, మొరటుగాను కనబడుతుంది. 1450 ప్రాంతంలో ప్రారంభమయినా 1800 వరకు ముద్రణ పరిశ్రమలో చెప్పుకోతగ్గ మార్పులు అట్టే లేవు కాని ఆ తర్వాత వచ్చిన, వస్తూన్న మార్పులు బ్రహ్మాండమైనవి. పరిశ్రమలో విప్లవం వచ్చిందనే చెప్పాలి. కాక్స్టన్ రోజుల్లో ముద్రాపకుడే టైపులను తయారుచేసుకునే పనినుండి అచ్చువేసి, ప్రతులను తీసేవరకు అన్ని పనులను చేసుకోవలసి వచ్చేది. కానియీనాడు ముద్రణకు అనేక శాఖలు ఉపశాఖలు ఏర్పడ్డాయి. ముద్రాలయాన్ని పర్యవేక్షించే వాడ్నేయిప్పుడు ముద్రాపకుడు అంటున్నారు ముద్రాలయంలో పనిచేసేవారు అనేకశాఖల్లో ఉండవచ్చు. అందరకు అన్ని పనులు తెలియపోవచ్చును. టైపులనుకూర్చే కంపోజిటర్ యంత్రాన్ని నడిపేమెషన్‌మన్ పుస్తకాలను కుట్టె బైండర్, మొదటి ప్రతులను సవరించే ప్రూఫ్‌రీడర్ యీ విధంగా వివిధ శాఖల్లో అనేకులు పనిచేస్తున్నారు. ఒకొక్కరు ఒకొక్క శాఖల్లో ప్రవీణ్యత సంపాదించుకుంటున్నారు. అంతేకాదు ముద్రణ పరిశ్రమ శాఖలుగా విడిపోయి ప్రత్యేక పరిశ్రమలుగాకూడా వర్ధిల్లుతున్నాది. అచ్చు దిమ్మలను తయారుచేసే ఫౌండ్రీ ఒకప్పుడు ముద్రణాలయంలో ఒక

శాఖ. కాని యిప్పుడది ఒక ప్రత్యేక పరిశ్రమ. బ్లాకులను తయారు చేసే బ్లాక్ మేకర్సు ప్రత్యేకంగా ఉన్నారు. సిరాను తయారుచేసే ఫాక్టరీలు వేరేఉన్నాయి. ఈవిధంగా శాఖోపశాఖలుగా వివిధ పరిశ్రమలు బయలు దేరాయి. అందువల్ల నేటి ముద్రణవిధానం చిత్రకారుడు, అచ్చు దిమ్మలను కూర్చేవాడు, ఫోటోతీసేవాడు, సిరాను ఉత్పత్తిచేసేవాడు, కాగితాన్ని తయారుచేసేవాడు మొదలయిన అనేకుల సహాయ సంపత్తిమీద ఆధారపడి వృద్ధి పొందుతూ ఉంది.

1789లో ముద్రణ విధానంలో ఒక ముఖ్యమైన మార్పు వచ్చింది. అంతవరకు దిమ్మపైన ఉబ్బెత్తుగా ఉండే అక్షరాలను అచ్చువేసే విధానమే ఆచరణలో ఉండేది. కాని ఆ సంవత్సరంలో ఎలోయిస్ సెనెఫెల్డర్ అనే వ్యక్తి ప్లానోగ్రాఫిక్ పద్ధతిని లితోగ్రాఫీ కనిపెట్టెడు. ఇది నేటికి గ్రీజ్‌కు మధ్యనున్న వైషమ్య సూత్రంపైన ఆధారపడింది. మరో నలభై సంవత్సరాలతర్వాత ఇంటాగ్లియో పద్ధతిని, కార్ల్ క్లిక్ కనిపెట్టెడు. దీనికి ఫోటోగ్రావ్యూర్ పద్ధతి అంటారు. కర్రదిమ్మలపైన, లోహపు దిమ్మలపైన అక్షరాలను చెక్కనవసరంలేకుండా ఫోటోగ్రాఫీ సహాయంతో ఆఫ్‌టోన్ బ్లాకులను తయారుచేసి అక్షరాలనేకాకుండా, చిత్రాలను ఒక్కనలుపు తెలుపురంగుల్లోనే కాకుండా యింద్రధనస్సులో ఉండే రంగులన్నీవచ్చేటట్లుగా అచ్చువేయడానికి వీలుకలిగింది. ఈ మార్పుతో ముద్రణ పరిశ్రమ కళగా రూపొందింది. ముద్రాపకుడు పారిశ్రామికుడుగాకాకుండా కళాకారుడుగాను, శాస్త్రకోవిదుడుగాను రూపొందాడు.

సాధారణ అచ్చుపనులకు అక్షరాలను పదాలుగాను, వాక్యాలుగాను కూర్చి వాటిని కావలసిన కొలతకు కాగితంమీద కావలసినన్ని ప్రతులుగా అచ్చువేసుకోడానికి యీ ఆధునిక పద్ధతులు మనకు ప్రస్తుతంఅనవసరం. ఈ పాత పద్ధతినైనా తృప్తికరంగా అచ్చువేసే ముద్రణాలయాలు మన ఆంధ్రదేశం అత్యల్పమనే చెప్పాలి. మద్రాస్, కలకత్తా, బొంబాయి మొదలయిన ప్రదేశాలలోని ముద్రాపకుల నేర్పుతో మన ఆంధ్రదేశంలోని ముద్రణను పోల్చి చూస్తే కించపడకతప్పదు. ఈ కళలో ఈ ప్రత్యేకంగా కృషి చేసిన వారు బహుతక్కువ మంది మన ఆంధ్రలో ఉన్నారు కాని త్వరలో తక్కనరాష్ట్రాలను మించి పోవడానికి మన వారికి అవకాశాలు ఉన్నాయి.

—X—

# కేనోపనిషదు

మూలం :

స్వామి చిన్మయానందజీ

అనువాదం :

డాక్టరు W. రాధాకృష్ణయ్య



గురువులకు గురువులైన దత్తాత్రేయులు, యీ త్రిమూర్తుల సారము. త్రిశక్తులసారము శ్రీ దుర్గాదేవి.

మన దేవతా స్వరూపములలో యెన్ని స్వరూపములున్ననూ, వారి యందరియందు కానవగు దైవశక్తి ఒకే స్వరూపముగలది. నిజముగా ప్రత్యేకముగా, త్రిమూర్తులలో ఒక్కరు మాత్రమున్న, శక్తి శూన్యులగుచున్నారు. సృష్టిలేనిదే, రక్షణ, వినాశములేవు, విష్ణువులేనిదే సృష్టినాశనములేదు. శివత్వములేనిదే, సృష్టిసంరక్షణ జరుగజాలదు. ముగ్గురు సమరీతి వ్యవహరించుటవల్లనే వారి శక్తి వెల్లడియగుచున్నది. దైవశక్తి ఏకము. ఈ కానవగు బాహ్యాద్వంద్వమంతయు భ్రమ. అసత్య అనుభవము. శుద్ధసత్వ మాయయందు, ప్రతిబింబించిన శక్తియే దైవాంశము. మలిన అశుద్ధ సత్వమాయయందు, ప్రతిబింబించిన శక్తియే, జీవాంశము. సంసారి, రాజసము కర్తృత్వము, తామసము, సోమరితనములేక వికర్తృత్వము మలిన నీటియందు ప్రతిబింబించిన సూర్య బింబము జీవుడు. శుద్ధ, నిర్మల, నిశ్చల, గంగాజలమున ప్రతిబింబించిన దైవాంశము ...

## మానవత్వ మెందుకు:—

ఈ మలినత్వము (మందబింబము). ఈ చలన ఆందోళన ఏలకలుగునో కనుగొనవలెను. మలినస్వరూపములైన తామసము, రాజసము, రెండు గుణములును, మనలో రెండు వివిధరీతుల పనిచేయుచున్నవి. మనలో ఆందోళన రూపమైన నిక్షేపము, సత్యమును మరగుపరచు ఆవరణము కలిగించుచున్నది. ఇది యేమో కనుగొందము. ఈ రెండు గుణములు ప్రత్యేకములైనవికావు. ఒకటితో నొకటి ఆధారపడియున్నది. విక్షేపమువల్ల కప్పు ఆవరించుట, ఆవరణములవల్ల ఆందోళనము కలుగుట, జరుగుచున్నది.

మనలోనున్న యీ కప్పును ఆవరించు గుణము, మూడు విపరీత భావములను కలిగియున్నది. 1. నాకు తెలియదు. 2. నీకు బోధపడుటలేదు, 3. నాకు అనుభవములేదు. ఈ మూడు విపరీత భావములను వేదాంత మార్గమున మూడు కార్యములవల్ల తొలగింపబడుచున్నది. శ్రవణము, మననము, నిధిద్యాపనము.

ఇతరులవల్ల బోధపొందక ఈ అస్థిర ప్రపంచమున, ఒక దైవాంశమున్నదని, మనము స్వతః విచారించి, తెలుసుకొనకపోవుటే, ఈ ఆవరణశక్తివల్ల కలుగు మొదటి ప్రమాదము. నాకు తెలియదు అనుటయే గొప్ప ఆవధారణ ఫలము. ఇది మహా పురుషుల, బోధవలన లేక, శృతిమూలమున శ్రవణము యను కార్యముచేత తొలగుచున్నది. ఈ దోషము తొలగినవెనక, అంతకన్న కొంచము సూక్ష్మమైన గుణము "నాకు బోధపడుటలేదు." అనునది తేలుచున్నది. జ్ఞానపూర్వక విమర్శనవలన, తర్కము వల్లను, ఈ నామరూప అస్థిర ప్రపంచ ప్రవాహములో, అద్వైత దైవాంశము, ఆత్మ యనునది ఒకానొక బంగారు సూత్రమువలె అంతర్భూతమై వెలుగుచున్నదని తేలగలదు.

కానీ వేదాంత శిష్యులు "నాకు అనుభవము కలుగుటలేదుగదా." అను అంశముతో తమలోనున్న సత్య నిత్య స్వరూప జ్ఞాన స్వరూప ఎరుకను గమనించక, పొరబడుచున్నారు. ఈ ఆవరణ దోషము వేదాంతమున ధ్యానాభ్యాసమువలన తొలగుచున్నది. ఈ ధ్యానమను అభ్యాసమువలన సాధకుడు తన మన

నులో ఇతర ఆలోచనల, అలజడికి చోటివ్వక ఏక రూప ఏకమార్గ ఆలోచనలతో. మనసును నింపి యుండుటకు శక్తివంతుడగుచున్నాడు. తుట్టతుదకు తన మనసును, నిద్రయందలి నిశ్చలత్వమువలె, నిద్ర గాక, నిశ్చలత్వమును పొందింప సామర్థ్యుడగుచున్నాడు. ఆ నిశ్చలత్వ సమయమున, పూర్ణయొరుకయగు, తన జ్ఞాన తేజసు, తన హృదయములో ప్రజ్వలించి వెలుగుచుండుట తాను అనుభవింపగలడు. ఈ జ్ఞానానందానుభవ సమయమున, లేక, వికల్ప సమాధి సమయమున, సాధకుడు తనకుగల, ఆవరణ దోషము, పూర్తిగా నశింపజేయగలుగుచున్నాడు.

ఇంతవరకు తామసజన్య "ఆవరణ" దోషమును గురించి విచారించినాము. మరియొకటి, "విక్షేపము" అనుమనసునందలి ఆందోళణము మిగిలియున్నది.

ఈ విక్షేపశక్తివల్ల, మనోవ్యాపారములోనున్న వ్యక్తప్రపంచము, ఆరంభమగుచున్నది. అందుండి ఈ స్థూలము ధృఢభావముతో కూడి పంచభూత ప్రపంచము కలుగుచున్నది. ఈ పంచభూత సమ్మేళనమువల్ల, నామరూపములు జ్ఞానేంద్రియముల, కర్మేంద్రియములు, కలిగి వాటిఫలితమైన దుఃఖవ్యసన పూరిత అస్థిరమృత్యువుతో కూడిన, అసహాయపు సంసారభావము వుత్పన్నమగుచున్నది.

దీనితో మానవుని పతనము పూర్తియగుచున్నది. నిత్యశుద్ధముక్త పరిపూర్ణ పరమాత్మ పదవినుండి నిర్మలజ్ఞాన స్వరూప పరమాత్మ, మాయాదోషగుణ జన్యములవల్ల, సోమదత్తుని తండ్రివలె, మనముకూడా, పరిమితులకులోనై, రూపము గాంచని కుటీరములలో, వివాహము పొందనిభార్యలతో, జన్మమెత్తని, శ్రీ సోమదత్తుడను పుత్రునితో, నివసించుచున్నాము.

వేదాంతము మానవుని పతనము మాత్రము తెలిపి, వ్యసనము గలిగించి మాయమగునదిగాదు. ఈ సూత్రమువల్లనే మానవునికి, కలిగినది, ఒట్టి కల్ల పతనము, నిజము కాదు, కలవంటిదని బోధించుచున్నది. నమ్మకముగల ఆధారములతో, జ్ఞానోదయము పొందించి, నిత్య సత్య, శాశ్వత స్వరూప ఓంకార స్వరూపులని బోధించుచున్నది.

**ఆత్మ నిష్ఠ:-**

ప్రపంచమునగల అన్నిమతములు, హిందూ మతమునగల, అన్ని యోగమార్గములును, ఇంద్రియములు (జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు) మనుష్యుని వశ్యములై యుండవలెనని, యేకీభావముతో తెల్పుచున్నది. తనలోను వెలుపలను, నిష్ఠగలిగియుండవలయును.

ఈ ఇంద్రియ బంధనములు, బలవంతపు కార్యముగా నుండకూడదు. ఈ దశేంద్రియజయము, బాహ్యవ్యవహారముతో గలగజాలదు, మన ఆంతరమున అజ్ఞాన ఆవృతకోరికలను కలశమును ముందు పగులగొట్టవలెను. అవిద్యనుముందు తొలగద్రోయవలెను. ఏకొంతభ్రమ మనలోమిగిలియుండినను, కోరికలు మొలచుటకు ఆస్పదమున్నది. ఈ కోరికలు, ఇంద్రియములను ప్రేరేపించును. జ్ఞానమువల్ల ఈ అవిద్యను మాపుచెందింపవలయును.

నానిజస్వరూపము, పరిపూర్ణనిర్మల జ్ఞానస్వరూపము. "శివోహం, చిన్మయోహం" అను, జ్ఞానోదయము పొంది, ఈ నామరూపభేదములతో కూడిన శరీరము నేనుగాదు, అనుధృఢభావముకలుగువరకూ, కోరికలకు మూలమగు అవిద్యభ్రాంతి తొలగదు.

ఈ పూర్ణజ్ఞాన స్వరూపము, మననిత్యస్వరూపమగుటచే ఆ స్వరూపము క్రొత్తగా కల్పింపవలసినదిగాదు. మన ఆవరణమను భ్రాంతి అజ్ఞానమను మైలను తొలగించవలెను. మేఘములను తొలగించగా దేదీప్యమాన సూర్య భగవానుడు బయల్పడును.

## వేదాంత మార్గము:-

ఈ అవిద్యనాశము కలుగుటకు, మూడు మార్గములున్నవి —శ్రవణము, మననము విధిద్యాసనము

తమోగుణము, యొక్క ఆవరణశక్తి ఎట్లు, శ్రవణ, మనన, నిదిధ్యాసనమువల్ల తొలగుచున్నదో ముందు తెల్పబడినది. మననము అభ్యాసముకలుగునప్పటికి, ఈ బాహ్యప్రపంచమువలన సుఖములేదని సాధకునికి తేటతెల్లమగుచున్నది. అప్పుడు ఇంద్రియనిగ్రహము ఆరంభమగును. ఇంద్రియనిగ్రహమువల్ల మనోవ్యాపార ఆందోళన తగ్గును. అందువల్ల అతనికి వేయిరెట్లు, ఆనందము, శాంతి, నిశ్చలత్వము, లభ్యమగును. అతని ధ్యానము, తీక్ష్ణమై ఊర్ధ్వగతి పొందగలదు.

ఆవరణము తొలగుకొలది, లేక్షేపముశాంతి పొందుచుండును. ఆందోళనలు శాంతి పొందుకొలది, ఆవరణదోషము క్షీణించును. కాలక్రమమున తమోజనితగుణములు రెండును, పూర్తిగా వశబడుచున్నవి. అపుడు తమోరజసలోపములు, మనలో అణిగిపోయి, సత్వగుణము పెంపొందుచుండును.

శృతిమంత్రములు విని మననము చేసి ధ్యానించుటవల్ల మనలో మనస్సను సరస్సునందు అలజడి క్షీణించి మలినత్వము పోవును. అపుడు మన శుద్ధ ఆత్మ సూర్యుడు, నిత్యసత్యస్వరూపుడు, పూర్ణముగా ప్రతిబింబించును. శుద్ధపరిపూర్ణప్రతిబింబమే, దైవాంశము. అప్పుడుసాధకుడు, కొద్దికొద్దిగా దైవత్వమును, ప్రకాశింపజేయగలడు.

అతనికి, అమానుష కార్యములను జేయుట కడు సులభము. అతని దృష్టియే కరుణ. దయ అతని స్వభావము. ప్రేమే అతని విస్వాస, నిస్వాసములు. కరుణ అతని సారము. సత్యమే అతని నడక.

గాంభీర్యమే అతని సొత్తు. ఇట్టి దైవమానవుడు ప్రపంచమున ఎట్టి స్థితిలోనైనను, నివశించగలిగి మార్గదర్శియై ప్రకాశింపగలడు.

కడపటి దాటు:—

ఇట్టి స్థితిలో అట్టి మానవాతీతుడు, తన సాధనమును, మరియు తీవ్రముగా సాధించగలిగిన యెడల తన స్వరూపము తెలియగోరి, అందే నిమగ్నుడై యుండదలచిన యెడల, అతడు యీ యమానుష కార్యములను, దైవగుణములను అతిక్రమించి, ధ్యాన తీక్ష్ణము చేత, సత్వగుణముకూడ అతిక్రమించినవాడై, సత్వాతీతుడై, దేవతలనుకూడా దాటిపోగలుగును. తనలో తాను సత్యపరిపూర్ణ పరమాత్మానుభవము పొంది, అతడే తానైపోవును. ఓంకార స్వరూపమును జెంది తానే ఓంకారమైపోవును. అతడు కడపటి పరిపూర్ణానంద పరమపదమును, పొందుచున్నాడు.

అందే అతనికి వాసస్థానము. ప్రపంచము అతనిలోనుండి ఉత్పన్నమైనది. అతనిలోనే వ్యవహరించుచున్నది. అతనియందే అది యంతయు కదలుచున్నది. కడపట అతనిలోనే అది యంతయు లీనముకావలెను. అతని స్వరూపమైపోవలెను. అద్వితీయ శాశ్వత పూర్ణస్వరూపము తాను.

మానవుడు అధోదృష్టివల్ల, నేను సంసారియని భ్రమించి, పతనముగాంచుచున్నాడు. ఊర్ధ్వగముడై దుఃఖరాసులనుండీ అభివృద్ధిగాంచి, సచ్చితానంద పదవిని గాంచుచున్నాడు. కనుక ఇంద్రియపరత్వము ఆత్మనిష్ఠలేనిది. దైవాంశమువృద్ధిగాంచదు. ఈ నిష్ఠ శ్రవణ, మనన, నిదిధ్యాసనమువల్ల, శిక్షణ పొందగలుగుచున్నాము. వేదాంతమును పఠింపుడు. నిశ్చలముగా వాటిసారమును ఆలోచింపుడు. క్రమముగాధ్యానింపుడు కూడ ఆశలను వదల ప్రయత్నించుచు, ఇంద్రియనిగ్రహమును, సాధింపుడు. జ్ఞానరీత్యా సాధనముకలుగును. మీకు విజయము తప్పదు. ఇచ్చటనే, ఇప్పుడే, యనిశ్రుతులు, నొక్కి వక్కాణించుచున్నవి. వినయశ్రద్ధలతో సేవజేయుడు. ప్రేమింపుడు. పరిశుద్ధము పొందుడు. ధ్యానింపుడు. సత్య స్వరూపము గాంచుడు. ఈజన్మమునందే గాంచుడు.

ఉపనిషదులు:-

వేదాంత వాదులకు వేదము శాశ్వతమైనదనియు, నాశనము లేనిదనియు, నమ్మకము. వేదమనగా వేద గ్రంధములు గాదు. వేదస్వరూపజ్ఞానము. జ్ఞానమునకు నాశనము లేదని తీర్మానము అజ్ఞానమే ఆత్మయనియు ఉపనిద్సారము.

(సశేషము)

# స్వాగతము



(శ్రీ జగద్గురు కాంచికామకోటి పీఠాధిపతులైన శ్రీ చంద్రశేఖర సరస్వతీ స్వాములవారు మైలాపూరు వచ్చినప్పుడు 24 10-57 శ్రీమతి సీతాదేవిచెల్లం చదివి సమర్పించిన స్వాగతపత్రం.)

శ్రీ పార్వతీ మనోహరు - శ్రీ పాదాయతనభూత చిత్త సరోజా
మా పాలి కల్పభూజా - ద్వైపాయన సదృశకోమ్ము స్వాగత మిదిగో॥
ఇనురాక నిరులువీడినయట్లు, నీ రాక - ననఘ! మా యజ్ఞాన మంతరించె!
త్రేతాగ్ని బోలు నీ దివ్య తేజమున, మా పాపాల వితతుల్ భస్మమయ్యె;
చంద్రోదయముగన్న సాగరంబనబొంగి.. మా యెదల్ నృత్యంబు సేయదొడగె;
నీ సూక్తిసుధ, క్షుత్పిపాసలందబాముటర్ - మేము నిర్జరులమై మెలగుచుంటి;
మార్యధర్మమా చంద్రతారార్కమెల-దిక్కులబ్రచారమొనరించుధీర! చంద్ర
శేఖరేంద్ర మునీంద్ర నీ శ్రీ పదములె, -- శరణు, శంకర గురువర్య! శరణు!
శరణు!

తినుటయు నిద్రించుటయును - పనిగాగల మమ్ముజూచి పరితాపమునన్
తన దృష్టి నుద్ధరించెదు - ఘనుడవు! నీవంటి దాతకలడే జగతిన్
శ్రీరాముం డడవిన్ వసించి మఱలన్ చిత్తంబు రంజిల్లనే
తేరన్; కోసలరాజ్యమందు ప్రజలెంతే నుత్సుకం బందిరా
యేరల్ మీఱిన హర్ష మెక్కటియుపో మీ రాక బోల్పంగనో
హారావంబు జయధ్వనుల్ కలిపె మా యుల్లంబులొక్కుమ్మడిన్.
మా మతమెగొప్ప; పెద్దది మా మతంబె! - యని తగవులాడు జనుల మధ్యను
తెగించి
యందఱకు సామరస్యంబు నలవఱచుచు బోధసేయు నీ కరుణను పొగడవశమె!



# "తల్లి"



శ్రీ ఏకా వెంకటసుబ్బారావు



"అమ్మా, అమ్మా ... ... పరీక్ష ప్యాసయ్యానే" అంటూ దిన పత్రిక తీసుకొని వచ్చాడు సత్యం.

"ఏదీ, పేపరులో పేరు పడ్డదా! నాయనా!"

"పేర్లు వేయరమ్మా నెంబర్లు వేస్తారు"

"ఏమో ... నాయనా ... నాకేమి తెలుసు? సుబ్బయ్యగారి అబ్బాయికూడా ప్యాసయినాడా? నాయనా"

"లేదమ్మా"

"పాపం! ... ఈ మారు కూడా తప్పాడన్న మాట. ఏమయితేంలే, నీవు ప్యాసయినావు—నాకదే కావాలి నాయనా—నా రెక్కల కష్టం ఫలించుతే చాలు"

"అమ్మా! ... నేను బజారుదాకా వెళ్లివస్తా"

"సరే, నాయనా. తొందరగా రా ... ... అబ్బాయీ! ... ... సత్యం! ... ... ఒక్క మాట. కాసేపు ఆగునాయనా." అంటూ లోపలికి వెళ్ళి వెంటనే వచ్చి "నాయనా! ఈ రూపాయి ఖర్చు పెట్టుకో" అని ప్రేమతో ఆనంద బాష్పాలు కురిపిస్తూ కుమారుని చేతిలో పెట్టింది. సత్యం ఆనందంతో బయటకు పరుగుతీసాడు.

అవును ... పాపం ... ఆతల్లికి కావలసిందేమిటి! చిన్నినాడే భర్త, ఈ బిడ్డను భూమిపైవదలి, తాను పరలోక గతుడయినాడు. చిల్లి గవ్వంత ఆస్తియూ లేకపోయెను. ఆమె దిక్కు చూచేదెవరు? ఎవరయినా డబ్బు ఉంటేనే, మావాళ్లు అని చెప్పుకొని తిరుగుతారు. ఏమాత్రం డబ్బు లేకపోయినా, దగ్గర బంధువులుకూడా కన్నెత్తి చూడరు. ఏమిచేస్తుంది? బస్తీ కాని ఆపల్లెటూరిలోనే పూటకూళ్ళ ళాలను ఏర్పాటు చేసి, కష్టపడి తనకుమారుని చదివించు కొంటున్నది. బళ్ళోకూడా ఇతనిని ఎవ్వరూ "సత్యం" అనిచెప్పుకొనే వారుకారు. అతను, ఎవరురా? అంటే పూట కూళ్ళ శీతమ్మ కొడుకు అనే వారు. ఎవరయితే నేం — చదువులో మంచి శ్రద్ధ చూపుచూ, ఉపాధ్యాయుల మన్ననలను పొందుతుండెడివాడు. మంచి పిల్లవాడని అందరిచే అనిపించుకున్నాడు.

"ఏం, శీతమ్మగారూ! ఏమిటి, ఇవ్వాళ విశేషం? చాలా, చాలా పిండివంటలు చేసారు."

"అవును, బాబూ! మా అబ్బాయి స్కూలు ఫైనలు పరీక్ష ప్యాసయ్యాడు. ఇవ్వాళనే పేపరులో వేసారట"

"ఓహో, అదా...సంగతి. అయితే అబ్బాయి ఇక కాలేజీ స్టూడెంటు అన్నమాట"

"ఏమో, బాబూ—కాలేజీ బడి ఈ ప్రాంతంలో లేదాయె. అందుకని పట్నం పంపుదామనుకుంటు న్నాను. ఏదో, రెక్కల కష్టం"

"అవునండీ, మీకుఱ్ఱవాడు చాలా వృద్ధిలోకి వస్తాడు"

"మీబోటి పెద్దల ఆశీర్వచనములు చాలు నాయనా ఎంత కష్టపడి అయినా చదివించుతాను."

"అమ్మా! కాలేజిలో సీటువచ్చిందే!! నాల్గు రోజులలో మద్రాసు పోవాలి."

"సరేలే నాయనా! పోవుదువుగాని. జాగ్రత్తగా చదువుకో. మన పొలిమేలదాటి ఎరుగవు. క్రొత్త

చోటు. జాగ్రత్తగా ఉండాలి నాయనా. చెడుసావాసాలకు పోకు. జనసమర్ధమయిన పట్టణం. బజార్లలో జాగ్రత్తగా పోతూ ఉండాలి. ఎవ్వరితోనూ విరోధం పెట్టుకోవాకు ......"

"ఏమిటమ్మా, నీ పిచ్చిగాని, చిన్నవాడినా— ఇన్ని చెబుతున్నావు"

"ఏమో, నాయనా, నీవు నాకు చిన్నపిల్లవాడివే ... తల్లి మనస్సు నాయనా... ఏదో చెప్పలేకుండా ఉండలేదు. డబ్బుకు ఇబ్బంది పడకు; నీవు బాగా చదువుకొంటూ ఉంటే, అదేచాలు; నాల్గురోజులకొక ఉత్తరం వ్రాస్తూ ఉండు. రాత్రిళ్ళు ఒంటరిగా తిరుగవాకు"

"సరే లే, అమ్మా"

సత్యం మద్రాసు కాలేజీలో చేరాడు. ఇంటర్మీడియట్ మొదటి తరగతిలో ప్యాసయ్యాడు. బి. ఏలో చేరాడు. అదికూడా మొదటి తరగతిలోనే ప్యాసయ్యాడు. శీతమ్మ, సత్యంలను గురించి ఆ గ్రామంలో చెప్పుకోనివారులేరు. యం. ఏ. లో చేరాడు.

"ఏం శీతమ్మగారూ! సత్యం దగ్గరనుంచి ఉత్తరాలు వస్తున్నాయా ?"

"ఆ, వస్తునే ఉన్నాయి బాబూ, కులాసాగానే ఉన్నాడు. ఈ ఏటితో చదువయిపోతుంది."

"ఏమోలెండి. పాపం!! మీకష్టం అక్కరకు వచ్చింది. ఆ!! అన్నట్లు మరిచాను. అబ్బాయి వివాహం ఈ సంవత్సరం ఏమయినా చేయదల్చుకున్నారా ? మొన్న, బెజవాడ కోర్టు పని మీద వెళ్ళాను. మా ప్లీడరుగారికి ఒక్కతే ఒక్కకూతురు. అమ్మాయి అప్సరసలాగా ఉంటుంది. వారికా ... దాదాపు మూడు లక్షలరూపాయల ఆస్తి ఉంది. అమ్మాయికూడా యఫ్. ఏ ప్యాసయింది. మొన్న మాట వరసకు మీ విషయం వచ్చింది. వారు మాట్లాడి చూడమన్నారు. మనము పోయి అమ్మాయిని చూచుకొని రావచ్చు."

"ఆ! అంత అదృష్టమా బాబూ!! ఏమయినా అబ్బాయి ఒప్పుకోవాలిగా. అయినా ఈ పూట కూళ్ళ సీతమ్మకొడుకు ఎక్కడ? వారి అంతస్తు ఎక్కడ ?"

"మీరు ఏమీ సందేహించకండి. నేను అన్నీ మాట్లాడుతాను. మీరుకూడా కుమారునితో అక్కడే కాలక్షేపంచేయవచ్చును."

"సరేలే, బాబూ! అబ్బాయి వచ్చింతర్వాత మాట్లాడి చెపుతాను."

సత్యం దసరా శెలవులకు ఇంటికి వచ్చాడు. తల్లి విషయం అంతా తెలియచేసింది. సత్యంకు మాత్రం అంత పెద్ద సంబంధం చేసికోవడం ఇష్టం లేదు. కాని తల్లి ఆదేశంవల్ల ఒప్పుకోక తప్పింది కాదు. తిథి, వార, నక్షత్రములుచూచి బెజవాడ ప్రయాణమయ్యారు. అమ్మాయికి అబ్బాయి, అబ్బాయికి అమ్మాయి నచ్చారు. సీతమ్మ తన కుమారునకు ఇంత అదృష్టం పడుతున్నందులకు ఆనందానికి మేరలేదు. బారిష్టరు ఆనందరావుగారు అన్ని విషయాలు తర్వాత తెలియచేస్తామన్నారు.

అనుకున్నట్లుగానే నాలుగు రోజులలో కబురు చేసారు. అన్నీ బాగనే ఉన్నాయికానీ, సీతమ్మగారికి ఒక్క విషయంలో మాత్రం మనస్సు చివుక్కుమనక తప్పిందికాదు. అబ్బాయిని ఇల్లరికం అడిగారు. తాంబూలాలు పుచ్చుకోవడానికి వెంటనే బయలుదేరి రమ్మన్నారు. ఆ రాత్రల్లా ఆమె ఆలోచించింది. ఇన్నాళ్లు అష్టకష్టాలుపడింది ఎవరికోసం ? ఈ నాడు ఇంకొకరి వశంకావాలా ? తననుకూడా రమ్మన్నారుగా. వెళ్తే వారు సరిగా చూస్తారో, చూడరో ? అవును. వాళ్లు లక్షాధికారులు. తనా, ఒక పూట కూళ్ళ పెద్దమ్మ అని అంతరాత్మ ఒకవైపు ప్రశ్నించింది. 'నీవా పెద్దదానివి అయ్యావు. నీవు ఎవరి సుఖం కోరుతున్నావు ? నీకు ఇంతకన్నా అదృష్టం దొరుకుతుందా ? నీవు ఎవరి సుఖము కొరకై కష్టాలుపడుతూ భూమిమీద నిలిచావో,

వాడు సుఖపడడం ఇష్టంలేదా? నీ కుమారునిమాట జవదాటుతారా? నీకు స్వేచ్ఛ ఎందుకు ఉండదు? నీ కుమారుడు ఇంత గొప్ప యింటివారి అల్లుడు కావడం ఇష్టంలేదా? నీ కుమారుడు ఏ పూటకూళ్ళ పెద్దమ్మ అల్లుడు అయితే బాగుంటుందా? అని ఇంకొకవయిపు బాధించింది. చివరకు నలుగురు పెద్ద మనుష్యుల సలహామీద తాంబూలాలు పుచ్చుకోడానికి బెజవాడ వెళ్ళింది.

వివాహ మహోత్సవం బ్రహ్మాండంగా జరిగింది. తన కుమారుని అదృష్టమునకు ఎంతో మురిసిపోయింది. పెండ్లికి వచ్చిన చాలా మంది పెద్దలు "ఇదేమి సంబంధమా?" అని ఆశ్చర్యపోయారు. ఎవరేమనుకున్నా వివాహము అయిపోయింది. కొడుకు, కోడళ్ళను ఆనంద భాష్పాలతో దీవించింది. ఇద్దరూ జంటగా తిరుగుతూ ఉంటే ఆనందంతో ఉప్పొంగిపోయింది.

సత్యం పరీక్షలు అయిపోయినవి. త్వరలోనే పరీక్షా ఫలితాలుకూడా వెలువడినవి. మద్రాసు విశ్వవిద్యాలయములో ప్రథముడుగా కృతార్థుడయినాడు. సీతమ్మగారు "భోజనహోటలుబోర్డు" వెనుకకుతిప్పి కుమారునితోకూడా బెజవాడ చేరింది. ఊరికే ఉండడం దేనికని సత్యం అచ్చటనే కళాశాలలో లెక్చరరుగా ప్రవేశించాడు.

కాలచక్రం తిరిగిపోతున్నది. సీతమ్మగారికి ఆ యింటిలో స్వేచ్ఛలేకున్నది. కోడలు చాలా హీనంగా చూస్తున్నది. ఇది అంతయూ కుమారునికి తెలియదు. అతను లేనప్పుడు సూటి, పోటీ మాటలు అనడం మొదలు పెట్టింది. ఒక్క మాటయినా కుమారునికి చెప్పలేదు. తాను మొదట ఏమయితే అనుమానించిందో అక్షరాలా జరుగుతున్నది. కుమిలి, కుమిలి పోతున్నది.

"నాయనా! సత్యం!! నేను మనవూరికిపోయి ఉండాలని పీకుతున్నది, నాయనా" అన్నది ఒక రోజు.

"అదేమిటమ్మా! అట్లా అంటున్నావు. నీకు ఇక్కడ బాగా జరగడంలేదా? నిన్ను సరిగా చూడడంలేదా? ఏంజరిగిందో, చెప్పమ్మా?"

"అబ్బే. ఏమిలేదు నాయనా! నాకు హాయిగానే ఉంటున్నది. కమలకూడా మంచిపిల్ల. ఏమో, మనస్సు అక్కడికే పీకుతున్నది. మన ఇంటిలోనే ఉండాలని ఉన్నది. ఇక్కడకు దగ్గరే కాబట్టి రెండు, మూడు రోజులకు ఒకమారయినా చూచి పోతుండవచ్చు. నీవూ, కోడలూ సుఖంగా ఉంటే నాకేమి కావాలి నాయనా!"

"సరే, నీ ఇష్టము అమ్మా." సత్యంకు తల్లిబాధ ఏమి తెలుసు. ఉదయం 10 గంటలకువెళ్ళి మరల సాయంత్రం 6 గంటలకు తిరిగివస్తాడు. తన భార్య ఎట్లా ప్రవర్తిస్తున్నదీ, తనకేమి తెలుసు. తల్లికూడా కుమారుని మనస్సు బాధకలుగుతుందని ఒక్కనాడు కూడా ప్రస్తావించి ఎరుగదు.

సీతమ్మగారు స్వగ్రామం చేరింది. పూటకూళ్లు తీసివేసింది. ఏదో, సత్యం కొంత డబ్బు పంపుతూ ఉంటే కాలంగడుపుతున్నది. కుమారుడుకూడా మూడు నాల్గు రోజులకువచ్చి తల్లిని పరామర్శచేసి పోతుండెడివాడు. చాలా సార్లు కోడలును తీసుకు రమ్మని కోరింది. కమల బస్తీవాసురాలాయేను. అందులో గొప్ప యింటి బిడ్డ. తన హోదాకు ఈ పల్లెటూరు రావడం అసలు ఇష్టంలేదు. సత్యంకు ప్రతిసారి, ఏదో సాకుచెప్పి తప్పించుకొనెడిది.

ఆ గ్రామంలో తెలిసినవారు "మీ కోడలును ఒక్కసారయినా రప్పించవేవమ్మా" అని అంటూ ఉండేవారు. మరి కొందరు "నీ కోడలుకు అంత గర్వమేమమ్మా? ఈ ఊరికి ఒక్కసారివచ్చి నిన్ను చూసిపోకూడదా? అయినా ఆమెగారు ఈ పూటకూళ్ళ సీతమ్మగారి ఇంటికి వస్తుందా?" అని అంటూ ఉండేవారు. సీతమ్మగార్కి మనస్సులో "బాకులతో చెలగినట్లు" ఉండేది, ఈ మాటలు విన్నప్పుడు. ఒకొక్కరోజు నిద్రపోయేదికాదు. కుమిలి, కుమిలి ఏడ్చేది. అంతా తన ఖర్మ అని అనుకుండేది.

కాని కుమారుడు వచ్చినప్పుడు మాత్రం అమితానందముతో ఉండేది.

ఈ విధంగా ఒక సంవత్సరము గడిచిపోయింది. సీతమ్మగారు మనోవ్యాధితో మంచం ఎక్కారు. కుమారుడు ప్రతిదినము వచ్చిచూచి పోతుండెడివాడు. వారం రోజులు గడిచింది. తల్లికి వ్యాధి తీవ్రరూపం దాల్చింది. సత్యం కాలేజీకి ఒక నెల శెలవుపెట్టాడు. తన భార్య కమలను తీసుకురావాలని చాలా ప్రయత్నించాడు. కానీ విఫలుడయ్యాడు. తాను మాత్రం తల్లివద్దనే ఉంటూ సపర్యలు చేస్తూ ఉన్నాడు. ఒక రోజు తల్లి కుమారుని "కోడలును ఒక్కసారి తీసుకురా, నాయనా!" అని కోరింది. మనస్సులో ఇష్టంలేకపోయినా తల్లిమాట తీసివేయలేక బయలుదేరాడు. త్రోవ పొడుగునా, "కమల వస్తుందా? రాదా?" అని పీకింది.

"కమలా! మా అమ్మగారు మంచంలో నిన్ను ఒక్కమారు చూడాలని అడుగుతున్నది. నీవు వెంటనే బయలుదేరివస్తే బాగుంటుంది."

"ఆ పల్లెటూరు ఎవరు వస్తారండీ? అక్కడ Manners తెలిసిన వాళ్లు ఒక్కరూ ఉండరు. ఏదో వాగుతారు నేను వస్తే ఒక ఎగ్జిబిషన్ తయారవుతుంది. అదినాకు బాగుండదు."

"అది కాదు!... కమలా!! నా తల్లి అష్టకష్టాలుపడి నన్ను ఇంత వాడిని చేసింది. నాకొరకై పడరాని పాట్లు పడ్డది. నిన్ను ఒక్కసారి, నా తల్లి కోరిక నెరవేర్చుటకై రమ్మని వేడుకొంటున్నాను ... కమలా."

"మరేమయినా, అనండి. నేను ఆ ఊరికిరాను. "పూటకూళ్ళ సీతమ్మకోడలు అదిగో" అని అనిపించుకోలేను ..........."

"ఆగు ......... ఏమన్నావు. నా తల్లినా, నీవుఅనేది. నాకన్న తల్లినా నీవుతుష్కరించేది. నా సుఖముకొరకై పడరాని పాట్లుపడ్డదే! అటువంటి నా పవిత్ర తల్లినేనా......నీవు అనేది. నవమాసాలు మోసి నన్ను పెద్దచేసిన మాతృమూర్తినేనా ... నీవనేది..."

"అవును, మీ తల్లి కాబట్టి మీరు సేవచేస్తారు. మీ అమ్మ మీకు ఎక్కువ; నాకేమీ అవసరంపట్ట లేదు ... కావాలంటే ఆమెగారినే ఇచ్చటకురప్పించండి, అంతే కానీ ...... నేనుమాత్రంరాను. ... పూటకూళ్ల శీతమ్మ కోడలు అని అందరిచేత అనిపంచుకోలేను ........"

"ఆ!!! ... ... ఏమిటన్నావు" అని బలంకొద్దీ చేతికందిన గ్లాసుతో ఒక్కయేటు వేశాడు. "ఛీ! పాపాత్మురాలా ... నీవునా భార్యవుకావు... నా పాలిట ఒక దయ్యానివి ... ... నీ ముఖం చూస్తేనే సమస్తపాతకాలూ చుట్టుకొంటాయి ... నా తల్లిని, కన్నతల్లిని దూషించిన దానివి నాశనమై పోతావు. నీనాశనం కొరకే ఎదురుచూస్తాను. నా తల్లి నిన్ను చూచినా పాతకం చుట్టుకొంటుంది. నీవు నా భార్యవుకావు. మనిద్దరం బ్రతికుండగా కలుసుకోలేము. నీ ధనంతో నీవే ఆనందం అనుభవించు..." అని చరా, చరా బయటకునడిచాడు. క్రింద ఉన్న అత్తగారూ మామగారు వెళ్ళిపోతున్న సత్యంను పిలిచారు. వినిపించుకోకుండా వెళ్ళిపోయాడు. వారిద్దరూ పైకి వెళ్ళి గదిలో చూచారు. ఇంకేముంది ... కమల బలమయినగాయంతో పడిఉన్నది.

సత్యం తల్లివద్దకు వచ్చాడు. అప్పుడే డాక్టరు పరీక్షచేసి వెళ్ళుతున్నారు డాక్టరును "ఎట్లా ఉందండి" అని ప్రశ్నించాడు. డాక్టరు విచారంతో "ఇంకొద్దిక్షణాలలో..."అనిమాత్రం అనకలిగాడు. "అమ్మా" అని సత్యం తల్లిపాదాలపైపడి పసివానిలా విలపించడం మొదలుపెట్టాడు. తల్లి "నా......య......నా! ......అమ్మాయి... రా ...లే... దా?" అని అడిగింది. "అమ్మా! అది నీ కోడలు కాదమ్మా. ఏనాడో మన పాలిటి భూతం అమ్మ! దాని పేరు తలిస్తేనే పాపం తగుల్తుంది. ... అమ్మా! ..."

"నా ... య.. నా... మీ...రి...ద్ద...రు ..

సుఖం... " అంటూనే కుమారుని కౌగిటిలో తీసుకొని కళ్లు మూసింది. సత్యం "అమ్మా" అంటూ ఒక్కటే కేకవేసి తల్లి పాదాలమీద పడ్డాడు. తెలిసిన వారందరూ చేరారు. సత్యంకు స్పృహలేదు సత్యం ముఖంమీద నీళ్ళుకొట్టి లేవతీసి, సముదాయించారు. ఎలాగయితేనేం, దహన సంస్కారములు చేయించారు. స్మశాన వాటికనుండి సత్యం తిరిగిరాలేదు. ఎందరో నెమ్మదిగా చెప్పారు. మాట్లాడడు. చివరకు బలవంతంమీద తీసుకురావాలని ప్రయత్నించారు. తనదగ్గరకు వచ్చిన వారినందరినీ ఇష్టంవచ్చినట్లు కొట్టి, రక్కాడు. ఎవ్వరూ ఏమియూ చేయలేక సత్యంను వదలివేసి వచ్చారు.

ఆ రాత్రి అంతయూ అక్కడనే ఉన్నాడు. మరునాడు శరీరమంతా బూడిద పూసుకొని "అమ్మా, అమ్మా!!" అంటూ ఊళ్ళోకివచ్చాడు. వంటిన ఒక్క ధోవతి తప్ప ఇంకేమియూ లేదు. ఈ కబురు బెజవాడలో తెలియగానే కమల, మామ, అత్తగారు కారులోవచ్చారు. సత్యంను చూడగానే అందరికీ భయంవేసింది. కమలనుచూడగానే సత్యం "ఆ ... హ హ...హ...హ...హ నా భార్యామణి వచ్చిందా? పూటకూళ్ళ సీతమ్మ కోడలేనా ... లక్షాధికారి ... చూడండి అందరూ చూడండి ... రా ... నన్ను తీసుకుపోవడానికి వచ్చావా...హ...హ...హ...హ...హో" అంటూ పరుగునవచ్చి కమల కంఠం పట్టుకొని పిసకపోయాడు. అక్కడివారందరూ సత్యంను ఇవతలకు లాగిపట్టుకొన్నారు. వదలించుకోడానికి పెనుగులాడాడు. చివరకు త్రాళ్లతో బంధించారు. ఇక అక్కడ ఉండడం మంచిదికాదనుకొని కమలా వాళ్ళు వచ్చిన త్రోవనే వెళ్ళారు. సాయంత్రానికి సత్యంకు అన్నం పెట్టాలని ప్రయత్నించారు. కాని తినలేదు. ఒకటే ఏడుపు. వదిలిపెట్టమని ఏడ్చాడు. అందరూ వదిత్తే ఏమిచేస్తాడో అని భయపడ్డారు. మరునాడు ఉదయం ధైర్యంచేసి కట్లు విప్పారు. ఎవ్వరినీ ఏమీ అనలేదు. ఒకటే స్మరణ. "అమ్మా ... అమ్మా ... అమ్మా" అంటూ రెండు రోజులు ఆ గ్రామంలో తిరిగాడు. రెండవ రోజు రాత్రి ఒక చెట్టుక్రింద కూర్చొని ఉండడం ఆ గ్రామంలో అందరూ చూచారు. రాత్రి ఎనిమిది గంటలకు వాన మొదలుపెట్టింది. సత్యంను తీసుకువెళ్ళడానికి చాలా మంది ప్రయత్నించారు. కాని రాలేదు. మరుసటి రోజు ఉదయం ఆ చెట్టుక్రిందలేదు. ఎక్కడకు వెళ్ళాడా, ఏమయినాడా అని ఆ గ్రామం అంతా గాలించారు. ఆనవాలులేదు. అప్పటికీ, ఇప్పటికి ఏమయిపోయిం ఎవ్వరికీ తెలియలేదు. ఏమయిందీ, ఆ సృష్టికర్తది భగంతునికే తెలియాలి.

---

# సంతాన నిరోధము - ఆయుర్వేదము

శ్రీ ప్రకాశచంద్రశతపథి



భారతం సస్యశ్యామలం. రత్నగర్భ. ఈ రత్నగర్భయందలి సమస్త సంపదలను వినియోగించుకొను శక్తి స్తోమతులున్న నాడు యెన్నికోట్ల జనాభాకయిననూ భుక్తికి లోటు లేదు. ప్రతి వ్యక్తికి తిన తిండి, కట్టబట్ట, ఉండ వసతి చూపగల్గి నదియే ప్రభుత్వము. నేటి ప్రభుత్వాల కట్టి శక్తిసామర్థ్యములంతగాలేవు గనుక ప్రజలకు తిండి సమస్య పరిష్కరింప జాల నంతగా గడ్డుగా తయారైనది. అందు వలన జనాభా పెరుగుదలను అరికట్టవల సిన అవసరం ప్రభుత్వాల కేర్పడినది. సంతాన నిగ్రహాన్ని ప్రచారం చేయుడం ప్రధానంగా పెట్టుకున్నవి. ఆయుర్వేదం సంతాన నిగ్రహాన్ని సహించదు. హర్షిం చదుకూడాను. కానీ అనుమతిస్తుంది. కుష్టు, క్షయ, యిత్యాది సాంక్రామిక రోగ గ్రస్తులు సంతానాన్ని కనకండావుండే సాధనాలను ఆయుర్వేద ముపదేశించినది. అంతేకాదు తగినంత ఆహారం సంతతికి చేకూర్చజాలనందున అనేకమంది బిడ్డలు నిత్యకృశులై అనేక వ్యాధులపాల్పడి భూమాత ఒడిలో తలదాచుకుంటున్నారు. బ్రతికి బట్టకట్టుతున్న వారు జీవచ్ఛవాలుగా నుంటున్నారు. అందువలన ప్రస్తుత స్థితి గతులలో కొంతవరకు సంతాన నిరోధాన్ననుసరించక తప్పడంలేదు. అందు చేత ఆయుర్వేదమునం దుదహరించబడిన విధానాలను సంతాన నిగ్రహార్థమై వైద్యులు అనుసరించక తప్పడంలేదు. ఆయుర్వేదమునందలి విధానాలు, ప్రస్తుతం అనుసరిస్తున్నట్టి విధానాల వంటివిగాక యెవరికివారు సులువుగా, సులభంగా, చౌకలో అనుసరించగల్గునట్టివి. పాశ్చాత్య వైద్య విధానాలవంటి అసహజమైనవి, అస్వాభావిక మయినవిగావు. వీటిని ప్రచారంచేసిననాడు సత్ఫలితాలను పొంద వచ్చును.

మనతోబాటు మన దొడ్లలో పెర డ్లలో మన గ్రామాలలో మొలిచే ఓష ధులు, గ్రామాలలోని అంగళ్ళలో దొరికే వస్తువులనుండియే వీటిని తయారుచేసు కొనవచ్చును. ఎవరికివారు యే ఒక్కరి సహాయంలేకుండా అనుసరించవచ్చును. ఆచరించి సత్ఫలితాన్ని పొందవచ్చును. కనుక ప్రభుత్వం తలపెట్టిన సంతాన

నిరోధ కార్యక్రమాన్ని కొంత భాగము, ఆయుర్వేద వైద్య విధానానికికూడా కేటాయించి ఆయుర్వేద వైద్యశాస్త్రాభ్యున్నతికి ప్రజారోగ్యాభివృద్ధికి దోహద మొసంగ గోరుచున్నాను.

వాయువిడంగములు - పిప్పళ్లు - పొంగించిన వెలిగారము - సమభాగములుగా గైకొని, చూర్ణించి, పావుతులం చూర్ణం ఒక మోతాదువంతున రోజుకు మూడు సార్లు బియ్యపుకడుగు నీటితో బహిష్టు అయిన స్త్రీ ఆ మూడు రోజులూ గైకొనిన ఆ స్త్రీకి మరి బిడ్డలు పుట్టరు.

ఈ వస్తువులు ప్రతి గ్రామంలోనూ లభ్యమగునట్టివి. ప్రతివారూ చేకూర్చుకొనగల్గునట్టివి. చాలా చవకగా తయారగునట్టివి. ఇట్టి చికిత్సాసాధనములు ఆయుర్వేదమునందనేకములుగలవు. నిశితమైన విమర్శనానైపుణి, పాండితీగరిమగల ఆయుర్వేదవైద్యుల నీ కార్యక్రమమునందుపయోగించ ప్రభుత్వాన్ని కోరుచున్నాను.

ఆయుర్వేదమునందలి యీ ప్రయోగాలను ప్రచారముచేసిననాడు ప్రజలు సంతోషముతో స్వీకరిస్తారు. ప్రభుత్వ ఆశయమూ నెరవేరుతుంది.

# భార్య

"శార్వాణి"





## (గత సంచిక తరువాయి)

"సెలవు యివ్వరు. అనవసరంగా నీవు బాధపడుతున్నావుగాని, నా వంట్లో కులాసాగానేవుంది."

"సరి. నీ ఇష్టం. అబ్బాయి వచ్చినతర్వాత అడిగి కనుక్కుంటాను."

"అటువంటి పనులు చేసినన్ను బాధ పెట్టకు." క్రిందకువంగి, గదివూడుస్తున్న కమల పమిటిచెంగు తొలగింది. సుందరమ్మ, బోసురుమంటున్న కూతురు మెడచూచి నిర్ఘాంతపోయింది. మంగళసూత్రం తాడు తప్ప, మెడమీద ఏమి కన్పించలేదు.

"బాల దొడుగు పెట్టిన చంద్రహారాలు, గుళ్ళ పేరు ఏమయ్యాయి. పోనీ బంగారు గాజులేమయ్యాయి. ఒక జతకూడ చేతికి కన్పించడం లేదేం? ఇదంతా చూస్తుంటే చాల విచిత్రంగావుంది." కూతుర్ని నిలదీసి అడిగింది.

"అన్నీ పెట్లోవున్నాయి. ఎక్కడికైనా వెళ్ళినపుడు పెట్టుకోవచ్చునని, పెట్లోపెట్టాను." అతి సునాయాసంగా అబద్ధమాడింది.

"నాకు నమ్మకం చాలకుండావుంది. పెట్టి తీసి చూపించు."

"అమ్మ! నామీద నీకు నమ్మకంలేదు కదూ!"

"ఏమోనమ్మ! నీవేదో మనస్సులో పెట్టుకొని చెప్పడానికి భయపడుతున్నావు. ఈ ఇంట్లో నీకేదో అన్యాయం జరుగుతూంది. లేకపోతే, నీ వింత మనియాద పెట్టుకొని నలిగిపోవు."

"ఈ ఇంట్లో నాకేమి అన్యాయం జరగడంలేదు. అంత తేలిగ్గా అనకమ్మ. నాఇల్లు నాకెప్పుడూ స్వర్గంలాగవుంటుంది."

"ఈ ఇల్లు నరకకూపమైనా, నీ మంచితనం స్వర్గం అన్పిస్తుంది. నీ కళ్ళ వెనుక బాధ, నీ మనస్సులో విచారం దాయడానికి ప్రయత్నం చేస్తున్నావు."

"ఈ విషయం గురించి మాట్లాడటం నాకిష్టంలేదు. నేను సుఖంగా బ్రతుకుతున్నప్పుడు, అనవసరపుసంగతులు చర్చించడం దేనికి? చెల్లి బావుందా? తమ్ముడు శ్రద్ధగా చదువుచున్నాడా?"

"అందరం బాగానేవున్నాము. నీవే ఈ విధంగా అయిపోనావు. చెల్లి నిన్ను చూస్తే బావురుమని ఏడుస్తుంది. తమ్ముడు నీవాలకంచూచి ఆనవాలు పట్టలేడు. నా మాటవిను ఒకవారం రోజులువుండి వచ్చేవచ్చును." సుందరమ్మ ఎంత చెప్పిన కమల విన్పించుకోలేదు.

అంతలో వెంకట్రావు కూరగాయలు తీసుకొని వచ్చాడు. సుందరమ్మను చూడనట్లు, వెనక్కితిరిగి వెళ్ళిపోబోయేడు. సుందరమ్మ ఆతన్ని పిలిచింది. కమల తనగురించి ఏమైనా అడుగుతుందేమో అని గజగజ మణికిపోతూ, ఆత్రంగా ప్రక్కన వెళ్ళి నిలబడింది.

"అమ్మాయిని తీసుకొని వెళ్ళమంటారా?"

సుందరమ్మ వసారాలోనికి వచ్చి, వెంకట్రావుని అడిగింది.

"అది వెళ్లాలనుకుంటే తీసుకొని వెళ్ళండి."

"రానంటుంది. మీరు వెళ్లమంటే వస్తుందేమో?"

"వెళ్లేది నేనుకాదుగదా! అటువంటప్పుడు నా యిష్టమేముంది. ఇచ్చట దానికి వుండటానికి యిష్టంలేకపోతే, నిరభ్యంతరంగా తీసుకొని వెళ్ళవచ్చును." చాల కరువుగా మాట్లాడి, అచ్చటనుంచి నిష్క్రమించాడు. సుందర్మ ఏదో అనబోయింది, కమల అచ్చటకు తొందరగా వచ్చి వారించింది.

"ఇప్పుడంతా అర్ధమయింది. నిన్ను కష్టపెట్టే నిజాన్ని దాయాలని ప్రయత్నం చేస్తున్నావు. మంచివాడని, బుద్ధిమంతుడని, చదువుకున్నవాడని బోలెడంతకట్నం యిచ్చి చేసినందుకు ప్రతిఫలం నిన్ను వుసూరుపెట్టడం. పైగాయిచ్చిన నగలన్నీ అమ్ముకొని తినడం ఇది ధర్మంగా వుందా?"

"అమ్మ! అటువంటి మాటలు అని నన్ను బాధపెట్టకమ్మ. వారేంచేసారని అనవసరంగా అనడం?"

"నిన్నీ గతికి తెచ్చింది చాలదా? నిన్నంత కష్టపెడుతుంటే, పైగా ఏమి అనవద్దంటావా? నీవిప్పటి కాలం మనిషివికాదు. సత్యకాలంలో వుండవలసిన దానివి. అతడు రానియ్యి. నిలదీసి అడుగుతాను. అతనిది హృదయమా? రాతిబండా? కట్టుకున్న ఇల్లాలు, ఒక అనాధ కుమిలికుమిలి రోధిస్తుంటే, బక్క శల్యమై చావుబ్రతుకుల మధ్య నలిగిపోతుంటే, వూరుకోమంటావా?" సుందరమ్మకు ఉధృతంగా కోపంవచ్చింది.

"నేను బ్రతకడం నీకిష్టంలేకపోతే ఆ ప్రయత్నం చేయి." ఎంతో శాంతంగా, దుఃఖాన్ని అణిచిపెట్టుకుంటూ, మెల్లగా అంటూ తలవొంచుకొంది. సుందరమ్మ కమలను హృదయానికి హత్తుకొని, కమల కళ్లలో కదులుతున్న కన్నీరునుచూచి బావురుమని ఏడ్చింది.

"పిచ్చితల్లి! నిన్ను అర్ధంచేసుకోలేక పోయాను. భర్త ఎంత హింసించినా, అతన్ని దైవంగా ఆరాధించబట్టే, ధర్మం యింతవరకు నిలబడివుంది. నీ ధర్మాన్ని నీవు కష్టనిష్టూరాలకు సహించి నిలబెట్టుకొగల్గుతున్నావు. నిన్ను భగవంతుడు ఎప్పటికైనా రక్షిస్తాడు." కమల కన్నీరును తుడుస్తూ, బుజ్జగించింది.

"అమ్మ!" అంటూ కమల తల్లిని, గట్టిగా కౌగలించుకొని, సంతోషంతో వుప్పొంగిపోయింది.

ఆ సాయంత్రం బండికి సుందరమ్మ పాలకొల్లు వెళ్ళిపోయింది. వెంకట్రావు మధ్యాహ్నం భోజనానికి రాలేదు. రాత్రి తొమ్మిదిగంటలకు యింటికి చేరుకున్నాడు.

"చాల ఆలశ్యమైంది. భోజనానికిలేవండి." కమల భర్త దగ్గరకువచ్చి రహస్యంగా చెప్పింది.

"తినేవచ్చాను."

"మధ్యాహ్నంకూడారాలేదు. అయితే వంట ఎవరికోసంచేయాలి. మీకంత కష్టంగా వుంటే చెప్పండి, మీ ఇష్టమొచ్చినట్లు చేస్తాను"

"మీ అమ్మ యింత అకస్మాత్తుగా యిచ్చటకు ఎందుకువచ్చింది? ఇంకావుందా? వెళ్ళిపోయిందా?" ఆఖరి మాటలు నిమ్మదిగా అన్నాడు.

"నన్నుచూచి చాలరోజులయిందని వచ్చింది. సాయంత్రం బండికి వెళ్ళిపోయింది."

"అంతా అబద్ధం. లేనిపోనివన్నీ ఉత్తరంలో వ్రాసివుంటావు. అందుకనే నిన్ను తీసుకొని వెళ్ళడానికి వచ్చింది."

"నేనేమి ఉత్తరం వ్రాయలేదు."

"ఉత్తరం వ్రాయకపోయినా, ఆమె వచ్చిన తర్వాత నూరిపోసివుంటావు."

"ఈ హృదయంమీద వొట్టువేసి చెబుతున్నాను. అమ్మకు మీరనుకున్నదేమి చెప్పలేదు."

"అయితే నిన్నెందుకు తీసుకొని వెళ్లలేదు?"

"మీ ఇష్టంలేనపుడు కావుండదని తీసుకొని వెళ్ళలేదు."

"నా ఇష్టంమీద నిన్ను మీ ఊరు పంపుతాను. వెళ్తావా?" కమల నిశ్శబ్ధంగా వుండిపోయింది. తల వూపి వూరుకుంది."

"రేపు ప్రొద్దుట బండికి బయలుదేరు."

"పదిహేను రోజులు సెలవుపెట్టి మీరుకూడా రండి. హోటల్ భోజనం తింటే మరీ చిక్కిపోతారు."

"సెలవుయిచ్చే మామయ్యా ఎవరులేరు. నీవు వెళ్లు." వెంకట్రావు పుస్తకంతీసి, పేజీలు తిప్పడం మొదలు పెట్టాడు. కమల వంటింట్లోకివెళ్ళి కాస్త ఎంగిలిపడి, అంట్లన్నీ తోముకొని, వంటిల్లు చక్కపెట్టుకొని వచ్చేసరికి రాత్రి 10 గంటలు దాటిపోయింది.

శనివారం ప్రొద్దుట బండికి కమలను పాలకొల్లు పంపించాడు. అతిసునాయాసంగా రోజులు దొర్లిపోతున్నాయి. కమల పాలకొల్లువచ్చి పదిహేను రోజులు దాటిపోయింది. ఇంకో నెల్లాళ్లువుండమని వెంకట్రావు ఉత్తరం వ్రాశాడు. ఆ నెలకూడ గడచిపోయింది. అతనికి మరొక వూరు బదిలీ అయిందని వ్రాస్తూ, కొంతకాలం అచ్చటే వుండమని రెండవ ఉత్తరం వ్రాశాడు. రెండవ ఉత్తరంవచ్చి రెండు నెలలయింది. వెంకట్రావు జాడ తెలియలేదు. దర్యాప్తుచేసిన తర్వాత బెజవాడలోనేవున్నట్లు, పాత ఆఫీసులోనే పనిచేస్తున్నట్లు దరిమిలా తెలిసింది. కమల తల్లి ఎంత చెప్పినా వినకుండా, బెజవాడ మంచి రోజు చూచుకొని బయలుదేరింది. బయలుదేరేముందు కుడికన్ను విపరీతంగా కొట్టుకోవడం మొదలు పెట్టింది. బెజవాడ స్టేషనులో దిగి, జట్కాబండి కట్టించుకొని తిన్నగా సూర్యారావుపేటలో యింతకు ముందున్న యింటికి వచ్చింది. తలుపులు వేసివున్నాయి. తలుపులు తట్టి పిల్చింది. కొంచెం సేపటికి, ఆడమనిషివచ్చి తలుపుతెరచింది. ఆమె వయస్సు ఇరువై సంవత్సరాలు పైచీలుకు వుంటుంది. కమల ఆమె నింతకముందెప్పుడు చూడలేదు. వెంకట్రావు ఇల్లు ఖాళీచేసి వెళ్ళిపోయేడేమో అనుకుంది. సంధిగ్ధావస్థలో పడేసరికి, వెంకట్రావు లోపలనుంచి బయటకు వచ్చాడు. కమల జట్కావాడికి డబ్బులిచ్చి, సామాన్లు లోపల పెట్టించింది.

"మళ్ళా ఎందుకు తయారయ్యావు? నేను సుఖంగా బ్రతకడం నీ కిష్టంలేదా?" కోపంతో త్రుళ్లిపడుతూ, గట్టిగా అరచాడు.

"ఈమెనా మీరు అగ్నిసాక్షిగా పెద్ద మనుష్యుల సమక్షంలో కట్టుకున్న భార్య" విషపు నవ్వు నవ్వుతూ మడతమంచం వాల్చుకొని కూర్చుంది.

"నీ కిచ్చట స్థానంలేదు. వచ్చినదారిని వెళ్ళిపో!"

"మన మనువు జరిగిన తర్వాత, నాతనువుండగా నాకిదే స్థానం. మీ సుఖాలకు నేను అడ్డురాను, మీ ఇష్టాలకు దూరంగానే వుంటాను. నన్నీ ఇంట్లో దాసిగా అయినా వుండనివ్వండి. మీ పాదసేవ చేస్తూ బ్రతుకుతాను." అతని పాదాలమీదపడి ఏడ్చింది. అతని రాతి హృదయం కదలలేదు. ఆమె కన్నీరు పాదాలనిండా తడిసిపోయింది. అతని మనస్సు మారలేదు.

"చాల మంచి అమ్మాయిలాగ కన్పిస్తుంది. పాపం, ఎక్కడకు వెళ్తుంది. మన ఇంట్లోనే వుండనివ్వండి వంటపని చేయడానికి పనికివస్తుంది." కొత్త మనిషిలేచి, వెంకట్రావు చేయిపట్టుకొని గదిలోపలకు తీసుకొనివెళ్ళి, తలుపులు వేసి గడియవేసింది.

సామాన్లు వసారాలో ఒకమూలపెట్టి, బావి దగ్గరకువెళ్ళిచూచింది. బావిలో నీళ్ళు కదలకుండా వున్నాయి. వంగిచూచింది. ముఖం కన్పిస్తుంది. నవ్వేకుంది, బావిలో ముఖంకూడా నవ్వుతోంది. చేద నూతిలో వేసింది. నీడ కన్పించలేదు. నీళ్లు తోడుకొని ముఖం కడుక్కుంది, పమిటిచెంగుతో ముఖం తుడుచుకొని, వసారాలోనికివచ్చి, పుట్టింటి దగ్గరనుంచి తీసుకొనివచ్చిన అరిసెలు రెండు తివి

మంచి నీళ్లు త్రాగింది. కన్నీటితో కడుపునింపుకొని, రాత్రంతా ఆలోచిస్తూ గడిపింది.

తెల్లవారకుండా లేచి, ఇల్లంతా తుడిచి శుభ్రం చేసింది. ఎక్కడ వస్తువులు అక్కడే వున్నాయి. గదులనిండా బూజు పట్టుకొని పోయింది. గోడలకు సన్నసున్నరాలి, నేలనిండా దుమ్ములోనిండిపోయివుంది. బూజులన్నీ దులపి, ఇల్లంతా కడిగి అద్దంలాగ తయారుచేసింది. ఏడుదాటినతర్వాత గదితలుపు తెరచి, యిద్దరు బయటకు వచ్చారు. కాఫీ సిద్ధంచేసి పెట్టివుంచింది.

"మోహిని! ఆమెకేమి కావాలో కొంచెం చూడు." వెంకట్రావు మొఖం కడుకొనివచ్చి, గదిలో సింగారించుకుంటున్న ఆమెను అడిగాడు.

"నేనిచ్చటకు వంటపనిచేయడానికి రాలేదు. అడ్డమైన వాళ్ళకు సహాయం చేయడానికి నేనేమి మీ దాసిని కాను." విసురుగా అనేసింది.

"ఇంతలోనే అంతకోపమా! నిన్ను పరీక్ష చేయాలని అన్నానుగాని. అసలు ఈ గదిలోంచి నీవు కదలవద్దు. భోజనం యిచ్చటకే తెప్పిస్తాను." వెంకట్రావు వంటింట్లోనికి వెళ్ళి, కమల చేత కాఫీ పంపించాడు. కమల కాఫీ తీసుకొని వెళ్ళింది.

"టిఫిను ఏమి చేయలేదా! నాకు వట్టి కాఫీ త్రాగే అలవాటులేదు. టిఫినులేనిదే కాఫిసహించదు వెంటనే ఉప్మా చేసి తీసుకొనిరా!"

"ఇంట్లో ఏమిలేవు రేపట్నుంచి మీరు చెప్పినట్లు నడచుకుంటాను. మా ఇంటిదగ్గరనుంచి అరిసెలు తీసుకొని వచ్చాను. అవి తెమ్మంటారా?" వినయ విధేయతలతో అడిగింది.

"నాన్‌సెన్స్! పల్లెటూరు చవటననుకున్నావా అరిసలు గిరిసలు తినడానికి. అటువంటి మాటలు నా దగ్గర ఇంకెప్పుడు అనొద్దు."

కమల అచ్చటనుంచి వెళ్ళిపోయింది. ఇంటిపనంతా తాను ఒక్కర్తే చేసుకుంటుంది. మోహిని ఏ విషయంలోకూడ సహాయపడటానికి రావడం లేదు. పైగా అమాయకురాలైన కమలమీద పెత్తనం చెలాయించడం మొదలుపెట్టింది. తిని విడిచిపెట్టిన ఎంగిలి విస్తర్ని తనచేత తీయిస్తుంది. ఆపని చేయడంలో ఆలశ్యంచేస్తే, రాక్షసిలాగ మీదకు వురుకుతుంది. ఆమెను ఎంత అగౌరపరచినా, తాను ప్రతి చిన్న విషయం శ్రద్ధవహిస్తూ ధర్మాన్ని జాగ్రత్తగా నిర్వర్తించుకుంటూవస్తుంది.

"చూడు! విడిచినబట్టలువున్నాయి. వాటిని శుభ్రంగా వుతికి పెట్టు. ఆసిల్కుచీర జాగ్రత్తగా వుతకాలి. గట్టిగా బాదేవంటే ముక్కముక్కలయిపోతుంది." అరడజను మాసిన చీరలను తీసుకొని వచ్చి, కమలముందు పారేసింది. కమల ఏమి అనలేదు. మాట్లాడకుండా వూరుకుంది.

"నీకేచెప్పేది! విన్పించడంలేదా!" కఠినంగా మాటాడుతూ, రెండుచేతులు నడుంమీద వేసుకుని, నిరాటంగా అచ్చట నిలబడింది, గుడ్లెర్రచేస్తూ.

"నేనేమి చేయననటంలేదు. తీరిక చేసుకొనితప్పకుండా మీ పని చేసిపెడతాను." త్రిప్పుతున్న తిరగల్ని ఆపుచేసి, ఆమెవంక చూచింది.

"సాయంత్రానికి నాకు బట్టలులేవు, ముందు నేను చెప్పినపని చేయి." కోపంతో మండిపడుతూ, ప్రేతంలాగ అచ్చటే కదలకుండావుంది.

"నా భర్త మీద గౌరవాన్ని కాపాడుకునే బాధ్యత వహించబట్టి, ధర్మాలను మరచి పోనీయకుండా చేస్తుంది. స్త్రీ జీవితం ఆ గౌరవంతోనే మీ మాటలుకు మర్యాదనివ్వాలి. ధిక్కరించే అధికారం వున్నప్పటికి, ఎందుకు ధిక్కరించలేక పోతున్నానో వూహించగల్గితే, సోదరి హృదయాన్ని అర్థం చేసుకోగల్గుతారు."

(సశేషము)




# బుద్ధిబలం

శ్రీ పి. పి. దాస్

మనం భాగ్దాదు నగరంలో జరిగిన వింతైన కథలెన్నో వినే ఉన్నాము. తెలివి తేటలకు వయస్సుతో పని లేదని భాగ్దాదు బాలుడు అబ్దుల్లా నిరూపించాడు. పెద్ద పెద్ద యోచనా పరులకు, తలనరసిన న్యాయాధికారులకు, కాలిఫ్ వంటి చక్రవర్తికి సైతము అభేద్యమైన సమస్యను అబ్దుల్లా పరిష్కరించి చక్రవర్తి మన్ననల నందుకున్నాడంటే అతిశయోక్తి కాదు!

భాగ్దాదు నగరంలో ఆలీకోజియా వజీరు అహమ్మదను ఇద్దరు స్నేహితులు. ఆలీకోజియా ఒకపవిత్రమైన బాగ్దాదు పౌరుడు. వజీరు అహమ్మదు ఒక వర్తకుడు.

ఒకనాడు ఆలీకోజియాకు మిక్కిలి అవసరమైన ఎడారి ప్రయాణం తటస్థించింది. అతని దగ్గర వేయిబంగారు నాణాలున్నాయి. అదే అతని కొద్దిపాటి ఆస్తి. (ఆ రోజుల్లో)

ఎడారి ప్రయాణం సుఖతమమైంది కాదు. మీదు మిక్కిలి దోపిడీ దొంగల భయం – అధికం, అంచేత తన సువర్ణ ఖండాలను ఒక నిర్భయమైనచోట దాచుకోవాలని నిశ్చయించుకొన్నాడు.

ఆలీవ్ పండ్లను దాచుకునే కూజా ఒకటి కొన్నాడు. పైడిముక్కలను ఆకూజాలో ఉంచి పైన ఆలివ్ పండ్లను పేర్చి కూజా మూతి బిగించి అతని నమ్మకమైన స్నేహితుడగు వజీరు అహమ్మదుకప్పగించాడు.

వజీరు అహమ్మదు అందుకు సమ్మతించాడు. ఒకగది అప్పుడే తెరచి కూజాను అందుంచమని స్నేహితుడితో చెప్పాడు. ఆలీకోజియా అలాచేశాడు.

రోజులు దొర్లాయి. ఏడేండ్ల తరువాత ఆలీకోజియా తిరిగి యిల్లుచేరాడు. వెంటనే స్నేహితుని ఇంటికి దాడుతీశాడు. తనకూజాను అడిగాడు. వజీరు అహమ్మదు ఎప్పటి మాదిరిగా గదితలుపు తెరచి కూజాను అప్పగించాడు.

ఇల్లు చేరి ఆలీకోజియా కూజామూతి తెరచిచూశాడు. పైన తను పేర్చినట్లు గానే ఆలీవ్ పండ్లున్నాయి. కాని ఆలీకో జియా విస్మయంచెందాడు. ఒక్క బంగారు నాణెంగూడా కన్పించలేదు. స్నేహితుడని నమ్మిన అహమ్మదు దగ్గరకు పరుగెత్తాడు. సవినయంగా ప్రాధేయపడుతూ తనబంగారు నాణాలనుగురించి అడిగాడు. వజీరు అహ మ్మదు అతన్ని అబద్ధాలకోరుగా, తుచ్ఛ మైనవానిలా తృణీకరించి, దూషించి కోపంతో గెంటించివేశాడు. న్యాయ స్థానంలో వజీరు అహమ్మదు మీద ఆలీకో జియా ఫిర్యాదుచేశాడు.

కాని వజీరు అహమ్మదు తెలివిగా తప్పించుకున్నాడు.

ఆలీకోజియా తనకు దాచమని ఇచ్చి నప్పుడు కూజాలో ఏమున్నదీ చెప్పలేదు. దానిలో ఏమున్నదీ తనకేమీ తెలీదని, తను మాత్రం ఉన్నది ఉన్నట్లుగా వాపస్ చేశాడని తన నిర్దోషత్వాన్ని ఋజువు జేసి కున్నాడు.

ఆలీ కోజియా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. సాక్షం, గీక్షంలేని ఆలీకోజియా ఏంచేస్తాడు పాపం!

న్యాయాధి కారికి ఇద్దరి వాగ్దానాల మీద ఆధారపడిన ఈసమస్యాపరిష్కారం బహుకష్టంగా దోచింది. ఆలీకోజియా చివరకు ఇహలోక ఉన్నత న్యాయస్థాన మైన కాలీఫ్ సమక్షంలో జారీచేశాడు.

బహుశా కాలీఫ్‌కుగూడా ఇది మిక్కిలి క్లిష్టసమస్యయేమో ?

కాని ఒక నాటి సాయంత్ర సమయాన మారువేషంలో ఉండగా పిల్లలు కొందరు యీకథను నాటకంగా ప్రదర్శించారు. న్యాయాధికారి పాత్రవహించిన అబ్దుల్లా అతి సులువుగా దోషిని నిర్ధారణ చేశాడు. అది గాంచి రాజు హర్షపులకితుడైనాడు.

మరునాడు అబ్దుల్లాను గౌరవించి తన స్థానమిచ్చి పరిష్కారం చేయమన్నాడు కాలీఫ్.

నిపుణులు అనుభవజ్ఞులు ఐన యిద్దరు ఆలీవ్ పండ్లవర్తకులను రాప్రవేశపెట్టాడు; కూజాలోని పండ్లను రుచిచూడమన్నాడు. అబ్దుల్లా రుచిచూశాడు. తియ్యగా మంచి సరుకుగా నిర్దేశించి ఇది ఈసంవత్సరపు పంటని వారి అభిప్రాయాన్ని తెలియ చేశారు.

ఎంతజాగ్రత్తగా దాచియుంచినప్పటి కైనా రెండేండ్ల అనంతరం అలీవ్ పండ్లు రంగునల్లబడి రుచిని గోల్పోవడం సహజం. ఏడేండ్లదీర్ఘ కాలంలో వజీరు అహమ్మద్ గదిలోదాచిన కూజాలోని పండ్లుమాత్రం రుచిచెడకుండా, రంగుమారకుండా, పరి

శుభ్రంగా ఉండడం వజీర్ అహమ్మదు చేసిన మోసానికి సాక్ష్యం చెప్పాయి. దాగిన రహస్యం బయటబడింది.

వజీరు అహమ్మదు తన తప్పు ఒప్పుకొని చక్రవర్తి పాదాలపై బడ్డాడు. అబ్బులా సునిసితమైన బుద్ధిబలానికి మెచ్చి అతని భావి జీవితాన్ని మరింత దీప్తి వంతంగా చేసేందుకు కాలిఫ్ ప్రోత్సహించాడు.

ప్రతి భావిభారత విధాతలగు బాలురు అబ్బుల్లా తెలివిగలిగి కీర్తిగడింతురుగాక!

---

# స్వ వి ష య ం

ఈ సంచికను 27వ సంపుటములో ప్రథమసంచికగా మీకందచేస్తున్నాము. ఇంతకాలము గృహలక్ష్మిపట్ల ఆదరాభిమానములతో మమ్ములను ప్రోత్సహించి సహకరించినందుకు రచయితలకు, రచయిత్రులకు, అభిమానులకు, పాఠకులకు మాకృతజ్ఞతను తెలుపుచున్నాము.

అభ్యుదయపురోభివృద్ధులను ప్రోత్సహించుటయే ఆదర్శముగాగల మా 'గృహలక్ష్మి' మరింత ఉపయుక్తంగా ఆకర్షణీయంగా చేయడానికి మీ సహాయసహకారములు సదా కావలసియున్నవి.

ఎప్పటియట్లు అభ్యుదయ రచనలకు 'గృహలక్ష్మి'లో అవకాశములు మెరుగైనా రచయితలు రచయిత్రులు తమరచనలను పరిశోధన, పరిశ్రమలతో సాగించినచో మేలైనవిగానుండగలవు. గృహలక్ష్మి కంకణ గృహీతలు, ప్రసిద్ధరచయితలు, రచయిత్రులు సయితము 'గృహలక్ష్మి' పత్రిక పురోభివృద్ధిపట్ల ఆసక్తిచూపినచో మేము చాలకృతజ్ఞులము.

ఇకముందు సయితము మీ ఆదరాభిమానములతో, సహకారముతో 'గృహలక్ష్మి' మరింత ఆకర్షణీయంగా వెలువడగలదని ఆశిస్తున్నాము.

---

# జానపద సాహిత్యము

శ్రీ ఆకుండి వెంకటశాస్త్రి

ఏజాతి సాహిత్యానికైనా సాంప్రదాయ పరంపరగావస్తూన్న జానపద సాహిత్యము ఉంటుంది. ఈ జానపద సాహిత్యం ఆ జాతి వాఙ్మయానికి ప్రాతిపదిక అని చెప్పవచ్చు. జనపదములంటే గ్రామసీమలు. గ్రామసీమలలో ఉండే ప్రజలు తమ తమ భావాల్ని స్వేచ్ఛగాను నిస్సంకోచముగాను వెలువరిస్తారు. ఆ భావాల్ని పాటలలోను, పద్యాలలోను వెలువరించినపుడు అవి కావ్యత్వగౌరవం పొందుతాయి. సజీవమైన వాఙ్మయం ఆ జాతి ప్రత్యేకతను సూచిస్తుంది. ఈ సాహిత్యంలోనే ఆ జాతియొక్క గుణదోషాలు, హెచ్చుతగ్గులు ప్రతిబింబిస్తాయి. భారతదేశమున యితర జాతులందులేని వీరారాధనము ఆంధ్రుల ప్రత్యేకతను చాటుచున్నది.

ఇవిగాక ప్రతిజాతికి కొన్ని కావ్యాలు కంఠస్థమౌతాయి. ఈ గ్రాంథిక కావ్యాలు, అలంకారభూయిష్ఠం అయి ఉండటంవల్ల కొంత అస్వాభావికమై ఉంటాయి. ఈ అస్వాభావికత జానపద సాహిత్యంలో అంతగా గోచరించదు. సహజమైనభావాలు సాధారణమైన ధోరణిలో వెల్లడింపబడతాయి. అలంకారాల ఆడంబరము అల్పంగా ఉండటంవల్ల వీటిలో భావాలకే ఎక్కువగా ప్రాధాన్యం యివ్వబడుతుంది. ఆంధ్రదేశంలో యిటువంటి జానపదసాహిత్యం విపులంగా ఉంది పిల్లలపాటలలో, తల్లులజోలలలో, బిచ్చగాండ్రగానాలలో, పొలంపనివాళ్ల ఊతపదాలలో, జంగం కథలలో. బొబ్బిలపాటగాండ్ర బుర్రకథలలో, యక్షగానాలలో, తోలుబొమ్మల సాహిత్యంలోను, వీటన్నిటిలోను, జానపద సాహిత్యం వెల్లివిరుస్తూంటుంది.

ఇటీవల మనదేశంలో వేర్వేరు భాషలలోని జానపదగేయ సాహిత్యాన్ని దేవేంద్ర సత్యార్థి అనువారు సేకరించారు. ఆయా భాషలలో ఉన్న జానపద సాహిత్యంలోని పరిణతిని, పాండిత్యాన్ని మాధుర్యాన్ని, నిరూపించుతూ యీయన ఆంగ్లములో వివరణవ్రాశారు. కొంతకాలమునుంచి మన ఆంధ్రదేశములోకూడ జానపద సాహిత్యాన్ని గూర్చిన ఆసక్తి ఎక్కువగా కనబడుతోంది. నేదునూరి గంగాధరం, టేకుమళ్ల కామేశ్వరరావు స్త్రీలపాటలను గురించి, పాతపాటలను గురించి పరిశ్రమచేసి వానిని సేకరించి ప్రకటించేరు. ఈ రీతిగానే మరికొంత జానపదసాహిత్యాన్ని సేకరించి హరి ఆదిశేషువు ఒక విమర్శనావ్యాసము వ్రాసినారు.

ఆంధ్రదేశంలోలాగే చైనాదేశంలోకూడా జానపద సాహిత్యం విరివిగా కనబడుతోంది. ఈ వాఙ్మయం పరిశీలిస్తే, చైనాలోనైనా, పెరూదేశంలోనైనా, జానపదుల హావభావాల మూల ప్రాతిపదిక ఒకటేనని తెల్లమౌతుంది. జావాలో జావనీయులు వేషాలువేసికొని యక్షగానాలను నృత్యగానాలతో ప్రదర్శించుతారు.

సాహిత్యము అనగానే అందులోని అంతర్భేదాలు మనకి స్ఫురిస్తాయి. జానపద సాహిత్యము వచనంగాను, గేయంగను ఉండవచ్చు. వచన సాహిత్యం సాంప్రదాయకంగా వ్యాపించుతూ ఉండదు. సామెతలలోను, తెనుగునుడికారముల తీరులలోను మాత్రము వచనము గోచరిస్తోంది. వీనికి సాహిత్యస్థితి అంతగా ఉండదు. "పుబ్బలోపుట్టి మఖలోమాడి పోయిందనీ, అందరికీ అన్ని రోగాలూ

అడ్డదు తప్పేలాకు ఏ రోగమూ లేదు," అని జానపదులు మామూలుగా వాడే యీ సామెతలలో ఉన్న సాహిత్యం తరతరాల్నుంచి వస్తూన్నా గ్రంథస్థితి పొందదు. సజీవమైన వాక్యమైతే తరతరాలకి నిలిచి ఉంటుంది.

ఇక కొన్ని పదములు, పాటలు, చూద్దాం - శిశువు జన్మించినది మొదలు బాల్యదశ వదిలేవరకూ కూడా ఆయా వయస్సుకి తగిన వాఙ్మయం అందింప బడుతుంది.

"ఉఊ‌ళూళూహాయీ - హాయి వారింటికి పోయి వత్తాము" అని తెలుగు తల్లులు తమ పిల్లల్ని జోకొట్టడానికి పాడే జోలపాటలూ — రామాలాలీ! మేఘశ్యామాలాలీ! తామరసనయనా దశరథతనయా లాలీ! అనే లాలిపాటలు, ఉగ్గుపాలతో పాటు కావ్యరసాన్ని పిల్లలకు త్రాగించడానికి పనికివచ్చేయి.

ఇవిగాక చింతాదీక్షితులుగారు వ్రాసిన జానపద సాహిత్యంలో బాలసారస్వతం తరువాత చెప్పుకో తగ్గది; స్త్రీల సారస్వతంలో జోలపాటలు, లాలిపాటలుగాక రామాయణ, భారత, భాగవతగాథలు, పెండ్లిపాటలు, బూజంబంతిపాటలు, అప్పగింత పాటలు మొదలైనవి, ఉంటాయి. ఈ అప్పగింతల పాటలలోనే సీతను, శాంతను అత్తలకు అప్పగించేటప్పుడు — "కైకమ్మ చేతిలో చెయ్యి ఒప్పగించి, చేడెరో! మీ సేవ చేయించుకోండి, మా పట్టిగాదు మీ పట్టియే సుమ్మీ - అది శాంతను, ఇదిసీత - సమముగా చూడు అని రామాయణ గాథలోనే అప్పగింతలు నడుస్తోంటాయి. ఇవిగాక తులాభారం, ఊర్మిళనిద్ర, లంకాయాగము, కుచ్చెలకథ మొదలైనవి స్త్రీలు పాడుకుంటూంటారు. ఈ స్త్రీల సారస్వతానికి నిత్యజీవనంలో విషయాలెన్నో కథావస్తువులుగా ఉంటాయి. తలుపు దగ్గర పాటల్లో "శ్రీ తరుణిరో నేను శ్రీరామచంద్రుడను చేరి కవాటంబు తీయవే" అని రాముడంటే - "ఖ్యాతిగ శ్రీ రఘురాముడవైతే, కోతులచేరగదోయి, ఘన సేతువు గూర్పగదోయి" అని వేళాకోళము చేస్తుంది.

ఇవిగాక జానపద సాహిత్యంలో ప్రధానమైనవి - వీరగాథలు. వీనిలో పలనాటి వీరచరిత్ర, శ్రీనాథవిరచితమగు జానపద గేయము. కాటమరాజుకథ, బొబ్బిలియుద్ధం, చిన్నప్పరెడ్డిపదం, అల్లూరి సీతారామరాజుకథ, ఝాన్సీ లక్ష్మీబాయికథ మొదలైనవి. ఈ పాటల్ని వీధిగాయకులు పాడుతూంటారు. జాలి పుట్టించేకథలు - బాలనాగమ్మకథ, లక్ష్మమ్మకథ పుత్తడిబొమ్మ - పూర్ణమ్మ యిటీవల గురజాడ అప్పారావు గారిది. వీరగాథలు జానపదులలోని వీరరసావేశాన్ని రేకెత్తింపజేస్తాయి. కాటమరాజుకథ, చోళరాజులకు, గొల్లవీరులకి జరిగిన యుద్ధాన్ని వర్ణిస్తుంది. ఆవుల్ని, గొఱ్ఱెల్ని మేపుకొంటూ బ్రతికే గొల్లవాండ్రకు ఆ ప్రాంతాలికి రాజైన మన్మసిద్ధిరాజుకి పుల్లరిని గురించివచ్చిన యుద్ధముయొక్క వర్ణనయిది. ఇందులో గొల్లలు ప్రాముఖ్యాన్ని గురించి యీ క్రింది వాక్యాలున్నాయి. గొల్లసుద్దులలోవి. "మాటి మాటికి నీవు గొల్లగొల్లడనియేవు - తిరముగా నీ భూమిని మోసెనుగొల్ల, తటి గొం డ లా గం గ త్రాటాయెగొల్ల - మాకులమునబుట్టె మదనగురుండు - మాకులమునబుట్టె మరియు సూర్యుండు -"

బొబ్బిలికథ తెలుగుదేశంలో జరిగినకథ. కోడి కోడిపందేలలో నిప్పు పుట్టింది. విజయనగరరాజులకి బొబ్బిలిరాజులకీ ఆభిజాత్య గర్వంవల్ల పోరు కల్గింది. ఈ పాట పాడుతోంటే, శౌర్యరసం పొంగి పొరలుతుంది. చివరకి స్త్రీలు అందులోను, వైశ్య స్త్రీలుకూడ యుద్ధంచేసినట్లు కనబడుతోంది.. తక్కెడగుండ్లు, పలాలగుండ్లూ, నీపునగట్టిరి, వడిశెల్లలో రాళ్లు చెక్కిరి స్త్రీలంత' అని వీసెరాళ్ళతోను, పదలం రాళ్ళతోను యుద్ధంచేసినట్లు వర్ణించారు. కరుణరసం ప్రవహించే వాక్యాలు కొన్ని చూడండి. "నల్లగాజులు-నల్లపూసలు-నాకూ నిల్పండి - బొట్టూ-కాటుక నిల్పుమయ్యాయో విజయరామరాజా! పూసపాటివారియిల్లే నాకూ - పుట్టిల్లనుకొంటి -" గోదావరి ఏజెన్సీ ప్రాంతంలో 'రంపపితూరీ' అనే అల్లూరి

సీతారామరాజు కథలోకూడ - రాజు, మల్లుదొర, ఘంటందొరల విక్రమం, సాహసం వెల్లివిరుస్తూంటాయి. వీధి భాగవతములు, తోలుబొమ్మలాటలు కూడ గ్రామ ప్రజలకు వినోదము కల్పించుటలో ప్రముఖస్థానము వహించుచున్నవి.

జానపద సాహిత్యంలో శైవ వైష్ణవ మత భేదాలకు సంబంధించిన కథలకొక ప్రధాన స్థానమున్నది. ఈ శైవ కథలకు పాల్కురికి సోమనాథుని ద్విపదలు మేలుబంతులు. ఇవి జాను తెనుగులో ఉన్న వర్ణనలు. బసవేశ్వరుని చరిత్ర శైవ వాఙ్మయానికి మూలవస్తువు. నిజలింగ చిక్కయ్య కథ, సారంగధరుని కథ మొదలైనవి శైవ వాఙ్మయంలోనివే. ఇటీవల యీ బుఱ్ఱకథా ధోరణిని రాజకీయ భావాందోళనమునకు ప్రచారమునకు కొందరు వాడుకొనుచున్నారు. జానపద సాహిత్యంలో యక్ష గానాలు, తోలుబొమ్మ లాటల సాహిత్యంకూడ ముఖ్య భాగములు. యక్షగానం అనగా ఒక గేయ ప్రబంధము. ఆ గేయాన్ని ఎవరో ఒకరు వేషం వేసకొని పాడుతూ ఆడేవారు. గోగుల పాటి కూర్మనాథకవి మృత్యుంజయ విలాసమనే యక్షగానం రచించినటు కనబడుతుంది. ఇట్టి యక్షగానాలు 'ఒపేరా' జాతికి చెందుతాయి. వీనిలో కొన్ని యక్షగానాలను ఎన్నోరోజులు ఆడదగినంత పెద్దవిగా కూడా ఉన్నాయట. రంగాజమ్మ రచించిన మన్నారుదాస విలాసము ఒక ప్రశస్తమైనయక్షగానం. యక్షగానాలలోని పాటలకు అప్పకవి లక్షణాలు వ్రాశాడు. జానపద సాహిత్యంలో ప్రాచుర్యంగా కనపడేది వీర రసము కరుణ రసమూను. అక్కడక్కడ. శృంగార రసంకూడా ప్రాధాన్యం వహిస్తూంటుంది. బావా మరదళ్ళ పాటలు, వదినలమీద పాటలు, మొదలైనవి హాస్యరస భూయిష్ఠములై చమత్కారంగా ఉంటాయి. ఈ పాటలన్నీ తెలుగు ఛందస్సులో పాడతగిన గమనం గలిగినవే. ద్విపద పాడడానికి అనుకూలంగా ఉండే ఒక ఛందస్సు. వృషభ గతిరగడ, కందార్థములు మొదలైన ఛందస్సులవలంబింప బడినవి. ఛందో లక్షణాలను పరిశీలిస్తే ఏదోవక ఛందో నియామానికి లొంగియే ఉంటుంది. ఈ ఈ గేయాలు రాగ తాళ బద్ధములై ఏదో ఒక ప్రసిద్ధమైన సంగీత సంప్రదాయానికి చెందినవై యుంటాయి. ఈ జానపద గేయాలను వారు తరచు వినిపించుచు ఖండాంతరములకు పంపుచు రేడియోశాఖవారు జానపద గేయాన్ని పాడించి దేశీయ సంగీత సాహిత్యాలకు దోహదం చేస్తూన్నారు. శ్రోతలు వీనిని ఆసక్తితో వింటూన్నట్లు చెబుతున్నారు. జానపద సాహిత్యంలో వ్యాకరణాది దోషాలు తప్పతిప్పలుగా ఉంటాయి. ఐనా యీ దోషాలు రసగ్రహణమునకు అడ్డురావు. గడ్డు వ్యాకరణ దృష్టితో వీనిని పరిశీలింపరాదు.

ఆధునిక జానపద గేయ రచయితలలో గురజాడ అప్పారావు, బసవరాజు అప్పారావు, నండూరి సుబ్బారావులు ప్రథములు. కవికొండల వెంకటరావు గారు జానపద గేయాల నెన్నిటినో రచించినారు.

జానపద గేయాలద్వారా, జనుల సాంఘిక జీవితము, ఛలోక్తులు, భాషలోని మాధుర్యం, వారి వేష భాషలు, ఆచార వ్యవహారాలు ప్రస్ఫుటమౌతాయి. "దుక్కి దున్నిన దేశమందు దుఃఖముంటుందా, కొల్లుగుచ్చిన దేశమందు కఱవులుంటాయా"

ఇవి సంక్రాంతి పండుగరోజులు - రైతులు పండించినపంట కుప్పలు నూర్చి పంటలక్ష్మిని యింటిలో భద్రంచేస్తారు. కష్టించిన రైతు ఏమన్నాడో వినండి "రావేలు పోవేలు - రాశి పదివేలు - రావేలు మీదయ్యా - రాశి మాదయ్యా" - ఆ నాటి చోళదేశపు వైభవాన్ని ఒక జానపదకవి యెలా వర్ణించాడో చూడండి - చెఱకురాజనంపు పైరులు - కాపు క్షేమముకలిగినా ఊరులు, విలసిల్లు నాటకశాలలు- అందు వింత వింత కృష్ణలీలలు - ఈ గేయాన్ని విన్నతోడనే ఆ నాటి అభిరుచులు - వినోదాలు, యీ నాటికి సజీవంగా ఉన్నాయని తోస్తోంది. అలాగే కాటమరాజు కథ, సర్వాయి పాపన్నపాట, అరుమరాటీల కథ మున్నగునవి జాతియొక్క వీరత్వాన్ని చవి చూపుతున్నాయి.

(ఆలిండియా రేడియో, విజయవాడ కేంద్రము వారి అనుజ్ఞతో)




**ఆయుక్షీణము** : శ్రీ పాలపర్తి నరసింహారావు, ప్రకృతి వైద్యులు, వేటపాలెం, గుంటూరుజల్లా. వెల. రు. 2-50

ఆయుక్షీణమునకుగల కారణములు, దాని నివారణకుగల మార్గములు యీ గ్రంథములో విశదీకరించబడినవి. ఇందులో ఆరోగ్యరక్షణకు సంబంధించిన ఆహార విహారాదులనుగురించి, అలవాట్లనుగురించి సుదీర్ఘంగా తెలుపబడి జీవయాత్రలో అమూల్యమైన సూచనలు చేయబడినవి.

రచయిత అనుభవజ్ఞుడైన ప్రకృతి వైద్యుడగుటచే యీ గ్రంథరూపంగా వెలువడిన వారి సలహాలు ప్రజల ఆరోగ్య సౌభాగ్యములకు విశేషంగా నుపయోగపడగలవు.

ధనమూల మిదం జగత్ : శ్రీ గిడుగు రామమూర్తి, ప్రకాశకులు : పరిశోధనా పబ్లికేషన్స్ 31 రిగస్ట్రీటు, మద్రాసు-5. వెల. 50 న.పైసాలు.

ఇది డిటెక్టివు నవల. కథ గ్రాంధిక చాలా బాగున్నది. చదివినంతసేపు ఒక నాటకాన్నో, సినిమాన్నో చూస్తున్నామా అనిపిస్తుంది. సంభాషణలు, పాత్రలపోషణ సంఘటనలు సమర్థంగా నిర్వహించబడినవి. ఇది పఠనయోగ్యమేకాక ప్రదర్శనకు సయితము తగియున్నది.

పరాజిత : శ్రీ కన్నెకంటి ప్రభాకరశాస్త్రి, శ్రీనివాసాగ్రహారం, నెల్లూరు. వెల. 50 న పైసాలు.

ఇది మాంచాల మధురవేదన, చిత్రాంగి చిత్తప్రవృత్తి, పరాజితయైన అహల్య, వ్యధిత హృదయ శకుంతల గురించి చిత్రిస్తూ రూపొందిన నాటికా సంపుటి.

రచయిత అభ్యుదయశ్రేణికి చెందినవాడై రచనాపోకడలలో పరిశ్రమ, నైపుణ్యములను ప్రదర్శించాడు. పండిత పామరుల ప్రోత్సాహంతో యింకా ఉత్తమ రచనలను సాగిస్తారని ఆశిస్తున్నాము.

**ఉపన్యాస రామాయణము** (చిత్రకూట సమావేశము) అనువాదకులు - శ్రీ పుచ్చా వెంకట్రామయ్య. ప్రకాశకులు : సాధన గ్రంథమండలి తెనాలి. వెల. 25 న.పై.

రైట్ ఆనరబుల్ శ్రీనివాసశాస్త్రిగారు ఆంగ్లమున రామాయణమును ప్రస్తుతించుచు మద్రాసులో నిచ్చిన ఉపన్యాసములలో చిత్రకూటమున శ్రీరామ, భరతుల సమాగమ సంవాదరూపమున 10 వ ఉపన్యాసము చిత్రకూట సమావేశముగా రూపొందించి. శ్రీ పుచ్చా వెంకట్రామయ్యగారి అనువాదం సయితం చక్కగా నున్నది.

# సంపాదకీయములు

## క్రమ శిక్షణావశ్యకత

ఆంధ్రప్రదేష్ గవర్నరు శ్రీ సచార్ స్కౌట్స్, గైడ్స్ సమావేశమునకు ప్రారంభోత్సవము చేయుచు క్రమశిక్షణా రాహిత్యమును, సంకుచిత తత్వమును నిర్మూలించుటకుగల ప్రధాన సాధనములలో స్కౌట్ ఉద్యమమును ప్రోత్సహించవలసిన అవసరమును వివరించారు.

దేశీయ శాంతి భద్రతల దృష్ట్యా కాని మెరుగైన నైతిక స్థాయి, దృక్పథము దృష్ట్యా కాని యువతీ యువకులలో క్రమ శిక్షణ అలవడవలసిన అవశ్యకత విశేషము.

సేవాసక్తి, విశాల దృక్పథము, త్యాగమును ప్రోత్సహించు స్కౌట్ ఉద్యమమును ప్రోత్సహించడము అత్యవసరము. క్రమశిక్షణా రహితమయినట్టియు, సంకుచిత తత్వముగల యట్టి యువతీ యువకులు జాతీయ సౌభాగ్యమునకు తోడ్పడలేరు.

## సేవాసంస్థలకు సహాయం

వినయాశ్రమంలో శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ గారు మాట్లాడుచు "సేవాసంస్థలకు సాధ్యమైన సహాయం చేయగలను" అన్నారు.

సేవాసంస్థలకు సహాయం చేయవలసిన అగత్యము మెండయినా ప్రతి సంస్థ తాము సేకరించు సహాయ సహకారములను సద్వినియోగం చేయుచుండుటను గమనించవలసిన ఆవశ్యకత మెండుగానున్నది. అది లేని నాడు సేకరించబడే సహాయ సహకారములు సంక్షేమమునకు తృప్తికరముగా వినియోగపడజాలవు.

## గ్రామాల అభివృద్ధి

మన దేశంలోని గ్రామాల అభివృద్ధికి అన్ని పార్టీల, వర్గాల సహకార సహాయములు అవసరమనునది యదార్థమే అయినా పంచాయత్, మునిసిపాలిటీల పరిపాలనా నిర్వహణ పార్టీ రాజకీయాల కతీతంగా నుండినచో అభివృద్ధి సుగమం కాగలదు.

## ధాన్యమునకు ధరలు ఎవరు నిర్ణయించాలి?

ధాన్యపు ధరలు నిలకడలేకుండా పెరిగిపోతున్న సందర్భమున ధరలను అదుపులో నుంచడానికి ఒక ప్రక్క ప్రభుత్వము ప్రయత్నిస్తుంటే వాస్తవికతను గుర్తించ నిచ్ఛగించని ఉత్పత్తిదారులు కొందరు చికాకు పడుచుండుట విచారకరము. ఉత్పత్తి దారులు న్యాయంగా, ధర్మంగా పరిమితమయిన లాభములకు ధాన్య నిల్వలను విడుదలచేసినచో ధాన్యంధరల పెరుగుదలపట్ల ఆందోళనచెంద నవసరములేదు. అధిక లాభములపట్ల ఆపేక్షతో అవకాశదారులుగా వ్యవహరిస్తున్న ఉత్పత్తిదారులనుండి రక్షించుటకు ప్రభుత్వము ధాన్యం ధరలను ఉత్పత్తిదారులకు, వినియోగదారులకు నష్ట, కష్టాలు లేకుండా నిర్ణయించ పూనుకోడం వాంఛనీయం కాదని ఎవరనగలరు?

## శ్రీ హేవళంబినామ సంII ర పుష్య, మాఘ మాసములు

| | | | |
|---|---|---|---|
| జనవరి నెల 1958 సంII | 16 | గు | ద్వా 50-36 అనూ 5.19 |
| | 17 | శు | త్ర 49-22 జ్యే 4.39 |
| | 18 | శ | చతు 49.24 మూల 5.12 త్యా 4.8 మాస శివరాత్రి |
| | 19 | ఆ | ● అమా 50.39 పూషా 6.58 |
| | | | **మాఘ మాసము** |
| | 20 | సో | శుపా 53.4 ఉషా 9.55 మాఘ స్నానవ్రతారంభం |
| | 21 | మం | విది 56-26 శ్ర 13.54 త్యా 4.20 |
| | 22 | బు | తది 60.10 ధ 18.44 |
| | 23 | గు | త 0.43 శత 24.15 శుక్ర మౌఢ్యారంభం |
| | 24 | శు | చ 5-22 పూభా 30.9 |
| | 25 | శ | పం 10.15 ఉభా 36-11 |
| | 26 | ఆ | ష 15-4 రే 42-6 |
| | 27 | సో | స 19-33 అశ్వ 47.35 సూర్యతిథి. రథసప్తమి |
| | 28 | మం | అ 23.26 భ 52-24 భీష్మాష్టమి - భీష్మ పంచక వ్రతం |
| | 29 | బు | న 26-70 కృ 56-21 |
| | 30 | గు | ద 28-3 రో 59.16 గాంధీజీ నిర్యాణ దినం |
| | 31 | శు | ఏ 29.22 మృ 60.10 భీష్మ ఏకాదశి |
| ఫిబ్రవరి నెల 1958 సంII | 1 | శ | ద్వా 28.57 మృ 0 39 భీష్మద్వాదశి |
| | 2 | ఆ | త్ర 27-16 ఆర్ద్రా 1.4 శుక్ర మౌఢ్యరహితం |
| | 3 | సో | చతు 24.22 పున 0.17 |
| | 4 | మం | ○ పౌ 20.22 ఆశ్రే 55.37 తిథిద్వయం |
| | 5 | బు | కృపా 15-27 మఘ 51.51 |
| | 6 | గు | విది 9-50 పూఫ 47-32 |
| | 7 | శు | తది 3-43 ఏష్యం 53-38 ఉఫ 42.56 |
| | 8 | శ | పం 50-59 హ 38.21 |
| | 9 | ఆ | ష 45-0 చిత్త 34-3 |
| | 10 | సో | స 39.38 స్వా 30.17 |
| | 11 | మం | అ 35-4 వి. 27-11 త్యా 3.52 |
| | 12 | బు | న 31-3 అనూ 25.22 త్యా 3-57 |
| | 13 | గు | ద 29.8 జ్యే 24-20 త్యా 4.2 |
| | 14 | శు | ఏ 27-58 మూ 24-37 |
| | 15 | శ | ద్వా 28.4 పూషా 26.8 |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press,
Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras.
**Ag. Editor : C. C. Punniah.**